శ్రీ

# త్రికోటీశ్వర చరిత్రము.

(కోటప్ప కొండ)

వచనము.

గ్రంథకర్త,

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ

నరసారావుపేట.

రెండవ కూర్పు 1000 ప్రతులు

1939

సీ॥ శ్రీమంతులై యశశ్రీ నెల్లకడల న
టించి మించంగ గావించినారు
తరతరంబులనుండి దాతలై హ
స్యంబులిడి విప్రగణముల నేలినారు
శ్రీ త్రికోటీశ్వర క్షేత్రాది సంస్థల పా
లకులై వృద్ధి పరచినారు
పండిత కవికోటి ప్రతిభలఁ గడు
విమర్శించి సత్కృతుల వ్రాయించినారు

తే॥గీ॥ వారు మలరాజవారని వన్నె కెక్కె
నట్టి వంశాబ్ధి రాకాసుధాంశుడైన
వేంకట నృసింహరాయ భూవిభునిఁ గరుణ
సిరుల నొసగుచు శౌరి రక్షించుగాత॥

నిర్మాతయగు కోరి సాలంకయ్య కాలము తెలియ నవకాశము లేదు కాని కలియుగాది యని పద్యకావ్యమున వ్రాయుటచే అంత పూర్వకాలమునాటిదైనను కాకున్నను ౧౫౦౦ సం॥లనాటిదైన కావచ్చును. ఇట్టి యపూర్వస్థలమునకు జనాకర్షణయంత్రస్థాపన చేయుటచే చ్యవనమహర్షివలె వృద్ధునకు యౌవనప్రాయము కలిగినట్లు మంచి సత్తా కలదై ఆపత్సమయములందు మ్రొక్కువారల కోర్కెలందీర్చుచు ఆపద్బాంధవుడగు శ్రీ వేంకటాచలపతి క్షేత్రమువలె విరాజిల్లుచు నానాట వృద్ధిగాంచుచున్నది.

ఇట్టి ప్రశస్త స్థలమాహాత్మ్యము వెల్లడించుట అత్యావశ్యకమగుటచే నీగ్రంథము సర్వజన పఠనీయమని నొక్కి వక్కాణింపవలసియున్నది. మఱియు భక్తి స్తోత్రములకనుకూలించు శ్రీత్రికోటీశ్వర కపోతీశ్వరాష్టకముల నిందుఁజేర్చుటచే మిగుల శ్లాఘాపాత్రమనదగియున్నది.

పూర్వమునుండియు జరిత్ర పరిశోధనయందు పేర్వడిసి గుంటూరు జిల్లాయందలి ముఖ్యస్థలముల చారిత్రలను వ్రాసిన యీ గ్రంథకర్తగారు చదువరులకు చిరపరిచితులు. ఇట్టివారి వలన చక్కని సులభశైలిని వ్రాయబడిన యీ గ్రంథమన్నివిధముల ప్రాముఖ్యమైయున్నది.

ఇందు వ్రాసిన విషయములు కొన్నికొన్ని గ్రంథస్థములే కాకున్నను సలపరిచితులగు వారిని విచారించియు వ్రాయబడినవగుటచే నెచటనైన నించుక భేదము లుండినను మందును.

చదువరు లట్టివానిని బాటింపక యొఱింగితురు గాక. చరిత్రాంశములు దీని మొదటి కూర్పునందంత విపులముగ వ్రాయబడక పోయినను ఆ కొఱత యీ రెండవకూర్పు తీర్చిన దని చెప్ప నొప్పును. శ్రీ త్రికోటీశ్వర దేవస్థానమువారి గ్రంథమును సర్వస్వామ్య సంకలితముగ స్వీకరించి పునర్ముద్రణ మొనర్చించుటయు ప్రధాన దేవస్థానాది దృశ్యముల బ్రత్యక్షముగ దర్శించునట్లు శ్రమ వహించి ఛాయాయంత్ర గ్రాహ ప్రతిమల (ఫొటోలు) నిందు జేర్చుటయు నందును ఏతత్స్థల పరంప రాగత ధర్మాధి కారులగు మ॥ రా॥ రా॥ శ్రీ (శ్రీ) రాజా మల్రాజు వేంకట నరసింహా రావు బహద్దూర్ జమీన్దారుగారి శుద్ధ సత్వ గుణ ప్రధాన శోభిత మగు ప్రతిబింబ మీ గ్రంథ ముఖసీమ నలంకరించుటయుఁ బిదప గ్రంథకర్త యొక్కయు నటుపైన కథా సందర్భానుసారముగ నుత్తరదృశ్యములయొక్కయు పటములు గ్రంథమున జేర్చుటయుఁ జూడ శ్రీ సరస్వతీదేవి సకల రత్నాభరణాలంకృతయై విరాజిల్లి చదువరుల కుల్లాసము గల్గింపుచున్నదనున ట్లలరారుచున్నది.

ఇట్టి శ్రీ త్రికోటీశ్వర చరిత్రము నెల్లరును బఠించి శ్రీవారికృపకుఁ బాత్రులై సేవించి యిహపర సుఖంబుల బడయుదురు గాక యని విన్నవింపు చున్నాడను.

నరసరావుపేట,
28—1—1939.

ఇట్లు,
అంగర వేంకటలక్ష్మీనారాయణరావు,
బి. ఏ., బి. ఎల్.

# విజ్ఞప్తి.

పాఠక మహాశయులారా!

చరిత్ర వ్రాయుటయన్న యెంతటిక్లిష్టసమస్యయో తమ కెఱుంగనిదికాదు. ఏలయన పూర్వమునుండియు నెప్పటివా రప్పటికప్పటికి చరిత్రలు వ్రాసియుంచకుండుటయు నెవరైన కొద్దియో గొప్పయో వ్రాసి యుంచినను వానిని మనవారు దాచి యొరుల కీయకయు దాము చూడకయు నుంచి నశింప జేయుటయు గల్గుచుంట ముఖ్యకారణములు కావున చరిత్ర కారులేదియో పూర్వాధారములపైనను యితరశోధనలపైనను ఆధారపడి వ్రాయవలసియున్నది. అడిగినను తెలిసియు చెప్పెడువారరుదు. ఇట్టి స్థితిలో చరిత్ర వ్రాయుదమన్న కష్టసాధ్యము. ఈచరిత్ర వ్రాయుటలో నాకు లభించిన వానిలోని కెల్ల ముఖ్యమగునది కీ॥ శే॥ బ్ర॥ కొప్పరాజు నరసింగయ్యగారి త్రికూటాచల మాహాత్మ్యమే. (పద్యకావ్యము) దానియందును వారు భక్తులు వేదాంతులగుటచే భక్తిధ్యానాదులచే గ్రంథమును పెంచిరి కాని చరిత్ర విరచించవలయునన్న తలంపు వారి కంతగ లేనట్లు గనుపట్టుచున్నవి. అందువలన తొలిపలుకునందు తెలవిచ్చినట్లు నేను కేవల గ్రంథశోధనపైననేకాక స్థలపరిచితులను విచారించుటపైనగూడా నాధారపడవలసివచ్చినదనుట నిశ్చయమే అయినను నానేర్చుకొలది చక్కగ శోధనచేసియె వ్రాసినాడను. ఎట్లయిన లోపములుండకపోవనుట నిక్కువము. అట్టివేమైన గన్పట్టిన దయతో దెలుపుదురేని పైముద్రణమునసైన సవరించి చేర్పించగలనని విన్నవించుచున్నాను.

ఇట్లు విధేయుడు,

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ. గ్రంథకర్త.

# విషయసూచిక.

## మొదటి ప్రకరణము.



## రెండవ ప్రకరణము.



## మూడవ ప్రకరణము.

## నాల్గవ ప్రకరణము.



## అయిదవ ప్రకరణము.



## ఆరవ ప్రకరణము.

## ఏ డ వ ప్ర క ర ణ ము.



## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము.



## తొ మ్మి ద వ ప్ర క ర ణ ము.



## ప ది య వ ప్ర క ర ణ ము.

పదకొండవ ప్రకరణము.





శ్రీరస్తు.

# శ్రీ త్రికోటీశ్వరాష్టకము



శా॥ శ్రీలింపొందు త్రికూటపర్వతముపై శ్రీదక్షిణామూర్తిలీ
లాలోలాకృతి నెల్ల మౌనులకు నాహ్లాదంబునన్ మౌనము
ద్రాలోకంబుల సంశయంబెడల దివ్యజ్ఞాన సద్బోధలన్
జాలంజేసిన నీకుమ్రొక్కెద మహేశా! శ్రీత్రికోటీశ్వరా॥

శా॥ శైలాగ్రంబున మౌనిరూపమున సంచారంబు గావింపుచున్
సాలంకయ్యకు గొల్లభామకును సాక్షాత్కారమున్ జూపి నీ
కైలాసస్థితి గూర్చినాడవట తత్కారుణ్యముప్పొంగ నన్
బాలింపంగదె దేవ దేవ శివసాంబా! శ్రీత్రికోటీశ్వరా॥

మ॥ పదిరెండేడుల వాఁడవే గురుడవై ప్రాయంబునన్వేనవేల్
ముదిమిందప్పిన మౌనులెల్లఱును నీబోధల్ వినన్ శిష్యులై
బౌవలంజూడ విచిత్రమౌనుగద శంభూ! నీమహత్వంబె వా
రెదనూహింపఁగలారు దేవగురుమూర్తీ! శ్రీత్రికోటీశ్వరా॥

మ॥ నిను నామానస గేహమధ్యమున మాణిక్యప్రదీప్తాసనం
బున నాసీనుఁగఁజేసి భూరినిగమంబుల్ బొల్చునామావళిన్
ఘనపత్రప్రసవాది పూజన ముదన్ గావింతునే వేళ భ
క్తుని నన్నెల్లపుడేలుమయ్య నతిసేతున్ శ్రీత్రికోటీశ్వరా॥

మ॥ పరమేశా! భవనాశ! శ్రీశముఖ హృత్పద్మాస నా
సూరకోటి స్ఫురితప్రకాశ ధృతగంగావాసకేశా!
కరరక్షోగళకాలపాశ! గతభక్తక్లేశ! నే దీనుఁడన్
శరణార్థిన్ ననుఁబ్రోవవే! త్రిజగదీశా! శ్రీత్రికోటీశ్వ

మ॥ భవ! నీదివ్యమహత్త్వ మెల్లసురలే భావింపలేకుండగా
నవివేకిన్ దురితుండ నాకుఁ దరమౌనా? యెట్టులైన
భవదంఘ్రుల్నిరనమ్మినాడ ననుగాపాడంగదే ప్రమో
శివసాంబా! గిరిజామనోహర! హరా! శ్రీమత్త్రికోటీ

మ॥ దివసారంభమునందు భక్తులతి భక్తిన్ స్నాతులై దం
గవలంగూడి గిరిప్రదక్షిణల వేడ్కన్ జేసి నీసేవకై
భవదర్థిస్థితులౌచుఁ బ్రార్థనల దీర్పంజూచి కావించు
శివరాత్ర్యుత్సవ మెన్న శక్యమగునే? శ్రీమత్త్రికోటీ

మ॥ వికలత్వంబున నున్నవాడఁ గరుణా విఖ్యాతచిత్తుండ
యకలంకస్థితిఁ గూర్పవేడుచుఁ ద్వదీయంబౌకథన్ వా
బ్రకటింతున్ భవదర్పణంబుగ గురుబ్రహ్మఖ్యుడన్ బా
వకుడ న్నమ్మినవాఁడఁ బ్రోవగదె దేవా! శ్రీత్రికోటీశ్వ



(౭) శ్రీ గోపీశ్వర స్వామివారు



శ్రీరస్తు.

శ్రీమత్త్రికోటేశ్వరాయనమః

# శ్రీ త్రికోటేశ్వర చరిత్రము.



## మొదటి ప్రకరణము.

క॥ శ్రీమత్త్రికూట పర్వత ।
ధామనివేశా! మహేశ! దక్షవినాశా! ।
నీ మహితచరిత వ్రాసెదఁ ।
ప్రేముడి నిటుఁ జిత్తగింపవే కోటీశా ॥

### క్షేత్ర ప్రస్తుత స్థితి.

శ్రీ త్రికూటాద్రి—(కోటప్పకొండ) — ఇయ్యది యపూర్వమగు పుణ్యస్థలమై "కోటప్పకొండ" అను పేరున ఆంధ్రమండలమున గుంటూరుజిల్లా నర్సరావుపేట తాలూకా నర్సరావుపేటకు 7 మైళ్ళలో దక్షిణమున ఎల్లమంద, కొండకావూరు గ్రామములమధ్యగల పర్వతక్షేత్రము. దీని చుట్టుకొలత "అడుగుతక్కువ ఆమడ" అని చెప్పుదురు కాని మూడుక్రోసులు మాత్రమె యున్నట్లు కనుపట్టుచున్నది. దీని వైశాల్యము రమారమి పన్నెండువందల యారడుగులుం

డును. దీనియెత్తు 1587 అడుగులు * రమారమి 600 అడుగుల యెత్తున నిపుడెల్లరు పూజించు కోటీశ్వరుని గుడి కలదు. ఈ గుడికిఁ బైభాగమున వేరొక కోటీశ్వరుని గుడికలదు. దీనిని "పాత కోటప్పగుడి" యందురు. ఇచ్చటికి జనులు తరుచుగఁ బోవుటలేదు. ఇచట దొరతనమువారు క్షేత్రగణితపు దిమ్మె (G. T. Survey Station) పెట్టించిరి. ఈ పర్వతము ఫారెస్టురిజర్వుక్రిందఁ జేరియున్నది. ఇచట అడవి ఫలములు, వంట చెఱుకు, పచ్చిక, ఓషధలతలు మూలికలు మొదలగునవి దొరకును. నీటి దొనలును భయంకరములగు గుహలును గలవు. చిఱుతపులుల భీతి కలదు. పూర్వము చోరభయమును కలదు; కాని యిపుడు జనులు తరుచుగనుండు వసతులేర్పడుటచే నంతగ లేదు.

## సోపాన మార్గములు.

ఈ పర్వతమునకు మూడు సోపాన మార్గములు కలవు. అవి (1) పాపవినాశనస్వామి గుడిక్రిందుగ నొకటి. ఇది పడక దారి. ఎల్లమంద సోపానమార్గమందురు. దీననుండి శ్రీ రాజాగారి యొంటె యెక్కుచుండెడిదట. (2) ఇపుడెల్లరు నెక్కు మధ్యమార్గము నూఁకేండ్లక్రిందట ఇప్పటి శ్రీ రాజాగారి తాత

---

* 500 గజములకంటె యెక్కువ యెత్తుకలది. చూ॥ కృష్ణాజిల్లా జాగ్రఫీ—1881 సం॥ ప్రాంతమున పారకాలలందు పఠనీయము—1600 అడుగులు. చూ॥ గుంటూరుజిల్లా జాగ్రఫీ (1934)

3. ప్రాతకోటీశ్వరునకు ఉత్తరమున నొక ఫర్లాంగు దూరమున "పుల్లచేతిదొన" అను నొకటి కలదు దీనియందు యెడమ చేయితప్ప కుడిచేయి పట్టదు. నిర్మలోదకముండును.

4. ప్రాతకోటీశ్వరునకు తూర్పున "ఉబ్బులింగము దొనకలదు. దీనికి సూర్యరశ్మి తగులదు. అతిశీతలోదకముం డును. ఇచట రామలింగమను లింగముండెనని చెప్పుదురు కాని యదృశ్యము. (ఇది అష్టదిగ్బంధనలలో నుత్తరదిశది)

5. పాపవినాశనస్వామి గుడియొద్దదొన.

6. ఈగుడి ఉత్తరమున గాడిదదొన.

7. మారేళ్లశిలకు ఉత్తరము 1 ఫర్లాంగునగలదొన.

8. పాలదొన. (ఎల్లమంద కొండకావూరు పొలి మేర చాలునగలది)

9. బుంగదొన (యెల్లచెఱువు దక్షిణమునగలది)

10. కాడిదొన (యెర్రిదొడ్లవద్ద జంగాలమఠమున కొక ఫర్లాంగున దక్షిణమునగలది)

11. చిన్నదొన(గద్దలబోడుదిగువరాళ్లగుట్టవద్దగలది)

12. హనుమంతుని లొద్దివద్ద దొన.

13. ఇంకొకదొన పాపవినాశనస్వామి గుడిక్రిందుగా నుండి యిటీవల రాళ్లుపడిపూడినదని చెప్పుదురు.

గుహలు.

1. నూతన కోటీశ్వరున కొకటిన్నర మైళ్ళదూరమున జంగాలమఠమను నొకటి. ఇందు బూర్వముజంగాలుండిరట.

2. దీనికిఁ దూర్పున దిగువను "దొంగలదొడ్డి" అను నొకటి.

3. ఎద్దుఅడుగునకు తూర్పుననొకటి (ఇది ఋష్యాదులకు తపోయోగ్యము)

4. మార్కేళ్ళశల పాపవినాశనస్వామికి ఉత్తరము నూత్నకోటీశ్వరునకు పడమరను గలది) ఇవి ముఖ్యమైనవి.

ఈ పర్వత మెటుచూచినను మూడు కూటములు (బోళ్ళు)గఁగనుపట్టును. (ఈ వివరము దేవాలయముల కథాభాగమున రాగలదు) ఇందుచే దీనిని "త్రికూటపర్వతము" అనియు నిందుఁగల దేవుని "త్రికోటీశ్వరు"డనియు నీస్థలపురాణమునకు "త్రికూటాచల మాహాత్మ్య"మనియు జెప్పిరి కాని పూర్వపు శాసనములలో నీపర్వతమును "త్రికూటాచల"మని చెప్పబడలేదు—కారణము మృగ్యము.

ఈపేరుగల పర్వతస్థలము లింక రెండుగలవు వాని వివరము ముందు విచారింతము.

మఱియు నీస్వామిని "ఎల్లమంద కోటీశ్వరు"డని పేర్కొందురు కాని యెల్లమందకన్న కొప్పూరే సమీపముగనుండుటచేఁగాఁబోలు పూర్వపు శాసనములలో "కొప్పూరి త్రికోటీశ్వరు"డని వాడఁబడినది

ఇదియుఁగాక వెలంటూరి త్రికోటీశ్వరుడని పూర్వము సత్తెనపల్లికి సమీపమున నొకక్షేత్రముండినట్లు సత్తెనపల్లి పేటలు పుక్రింది శివాలయమునగల శిలాశాసనమువలన గనుపట్టుచున్నది. ఇది సత్తెనపల్లికి బడమరగల పాటిస్థలమని చెప్పుదురు.

ఈ పర్వతముక్రింద నొక పాటిస్థలము కనుపట్టుచున్నది. ఇది "నందిపా"డను పూర్వమొక గ్రామముండి లేచిపోయి పాడనియు నిది గురువయపాలెమున గలసె ననియుం దెలియ చున్నది. ఇచట శిథిలమగు శివాలయపు చిన్నెలు కనుపట్టు చున్నవి.

## త్రికూటాచల స్థలవివరణము.

1. ఈపర్వతముగాక త్రికూట పర్వతమునునది గజేంద్రమోక్షణ స్థలమైనట్లు భాగవతమునగలదు. ఇది రాజపుటానాలోని అజ్మీరు పురమున కేమమైళ్ల దూరమున "పుష్కరక్షేత్ర"మనకలదు. అచట త్రికూటపర్వత ముండెను. అందు "గాయత్రి" సావిత్రి "సరస్వతి" యను మూడు పర్వతశిఖరములు గలవు. దీనినే గజేంద్రమోక్షణస్థలమని చెప్పుదురు. (ఈసంగతి మైసూరు దేశస్థుడును భరతఖండమంతయుచు దిరిగి సమస్త క్షేత్రములను సేవించి నరసారావుపేటలో (ఆంగీరస సం॥ కార్తీక శు 3 మంగళవారము (1—11—32)న సిద్ధిపొందిన అత్తినూరు శ్యామయ్యగారను 90 యేండ్ల వృద్ధబ్రాహ్మణుడు చెప్పెను)

2. తిరునెల్వేలిజిల్లా తెంకాసి రైలుస్టేషనుకు మూడుమైళ్లలో "తిరుకుత్తాలము"వద్ద త్రికూటాచలముకలదు. ఇందు "తిరుకుత్తాలేశ్వరుడు రాజరాజేశ్వరి కోవెలలును అగస్త్యాశ్రమమును గొప్ప నీటిధారలును గలవు. (చూ॥ 1928 జూన్ 16 తేది ఆంధ్రపత్రిక)

## రెండవ ప్రకరణము.

## స్థలపురాణ నిర్మాణము.

ఈ స్థలము యుగాంతరములనుండి మహిమకలదై యుండినట్లు చెప్పెదురు. దీని మాహాత్మ్యమును దెలిసికొనుటకు కీ॥ శే॥ బ్ర॥ కొప్పరాజు నరసింగయ్యగారను నరసింహకవి సత్తెనపల్లి తా॥ (కోసూరు) వ్రాసిన శ్రీ త్రికూటాచల మాహాత్మ్యమను మూడాశ్వాసముల పద్యకావ్యము ముఖ్యాధారము. మరియు బ్ర॥ రూపెనగుంట సీతారామయ్యగారు 1905 సం॥న గుమ్మెటకథ (రగడ) వ్రాసిరి. ఇందు ఉత్సవ విశేషములను వర్ణించి కథాభాగము నించుక పీఠిక వ్రాసిరి కాని దేనినిబట్టి వ్రాసిరో తెలియదు.

ఏబదేండ్ల క్రిందట బ్రి॥ తుళ్లూరి మాధవరాయడుగారి కథను క్లుప్తముగ "మనోకాంతా ముక్తికాంతా సంవాదముగ ౧౨ చరణముల కీర్తన వ్రాసిరి. కాని యీరెండును నాచరిత్ర కుపయుక్తములు గావయ్యెను.

ఇక మొదటి గ్రంథమునుగూర్చి విచారింతము దీనిని శా॥ శ॥ ౧౭౭౪ (క్రీ॥ 1852) విరోధికృతు సం॥ మాఘ బ౧౪ సోమవారంనాటి శివరాత్రికి నరసింహకవి సకుటుంబముగ నీ కోటీశ్వరు సన్నిధికివచ్చి సేవించి యుపవాసాదులు సల్పి యచటి బ్రాహ్మణులను గాంచి "యింతటి మహోత్సవము జరుగు స్థలమెచటనైనఁగలదా" యని యడుగ, వారు స్వామీ! మేమెచ

టను గనలేదు. ఇంతటి మహావైభవము జరుగు మహాస్థల మున కేదేని స్థలపురాణముండకపోదు. మీరావిషయమును వెల్లడింపుడనికోరగాఁ దాని మదినిడికొని మరునాడు తిరిగి వచ్చుచుండగా మార్గమధ్యమున శ్రీశైలప్రాంత నివాసియు, ఉద్భటారాధ్య వంశజుడును ముదిగొండ వీరభద్రారాధ్యుల పౌత్రుండగు కేదారలింగమను ఆరాధ్యబ్రాహ్మణుఁడెదురగు టయుఁదానావిప్రునకునమస్కరించి తన మనోవాంఛ నెఱిఁగింప నాతండువల్లెయని యిట్లు తెలిపెనట.

“ఇయ్యది పూర్వమున శివుడు దక్షిణామూర్త్యవతారంబున బ్రహ్మండెండోల్ల వటుఁడై సమస్త దేవఋషులకు బ్రహ్మోపదే శమొనర్చిన పుణ్యక్షేత్రము. దీనివిషయము చిదంబరనటన తంత్రమునగలదు” అనిచెప్పెను. అంతట నీకవి సంతసించిగ్రంథ విచారణచేసి శ్రీదక్షిణామూర్తిస్వామికిఁ గృతినిడి మూడా శ్వాసముల పద్యకావ్యమును వ్రాసెను. దీనియందును కథా భాగము క్లుప్తముగను వర్ణనలు భక్తిస్తోత్రాదులు విస్తారము గను వ్రాయబడెను. ఈయన వేదాంతి కవి. కొలగాని కో టయ్య (లింగబలిజ జూలకల్లు)కు గృతిగా సూతసంహితయు నింక పెక్కు గ్రంథములువ్రాసి క్రీ॥శ॥ 1878 బహుధాన్య సం॥ మార్గశిర బ ౫ న స్వర్గస్థుఁడయ్యెను. వీరి శిష్యులు చాలా మంది వీరికి గురువారాధనము చేయుదురు. వీరి గ్రంథమున కథాభాగమిట్లున్నది.

## పురాణ కథా భాగము.

శ్రీమజ్జగదేక రక్షకుండగు మహాదేవుడు పరాశక్తి యుక్తుండై కైలాసగిరియం దుండుతఱిఁ బార్వతి శివునిగూర్చి

"దేవా! తాము దక్షిణామూర్త్యవతార సమయమున వసించిన శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యమును వినిపింపుడని వేడ శివుఁడు పార్వతికిట్లని చెప్పందొడఁగె:—పూర్వము బ్రహ్మమానస పుత్రుండగు దక్షుండు మేరుపర్వతమున శివునిగూర్చి తపము చేసి శివుఁడు ప్రత్యక్షుఁడై వరము వేఁడుమన "ఆదిశక్తి తనపుత్రికగఁ బుట్టునట్లును ఆమెను శివునకిచ్చి పెండ్లిసేయునట్లును వరము వేడ నమ్మహాదేవుఁడట్లే ప్రసాదించెను. అంతట దక్షుండు సతీదేవియను పుత్రికం గాంచి శివునికిచ్చి పెండ్లిగావించెను: పిదప శివానుగ్రహమున దక్షుఁడు మహైశ్వర్యవిరాజమానుండై విఱ్ఱవీఁగుచు శివుడు భిక్షుకుడనియు, స్మశానవాటికలందుండు నీచుడనియు, గౌరవనీయుఁడు కాడనియు, తానొకతూరి కైలాసమున కేగఁ బవకుఁ బ్రత్యుత్థానాభివందనములొనర్ప లేదనియు మనమున గ్రోధించి శివద్వేషియై యుండెను. ఇట్లుండి తానొక యజ్ఞముసేయ సమకట్టి బ్రహ్మ, విష్ణువు మొదలగు నెల్ల దేవ ముని గణముల రావించి శివుని, తన పుత్రికయు శివుని భార్యయు నగు సతీదేవిని బిలువక యజ్ఞము సేయ నారంభించెను. ఈవిషయము తక్షణంబ నారదుండు శివున కెఱింగించెను. ఈవిషయము సతీదేవియు నెఱిగి తండ్రి చేయు యజ్ఞముఁ జూడ నిచ్చగొని భర్త యనుమతిగోర, నాతఁడు "పిలువని పేరంటమునకుఁ బోరా" దని వారించెను. అది వినక తాను పోయివచ్చెదనని చెప్పి యెట్టకేలకు సెలవు గైకొని సుతుడగు విఘ్నేశ్వరునితోడ యజ్ఞవాటిక కేగి తండ్రిచెంతనిలువ, దక్షుండు హరుని యెడ గల యసూయచే నామెను కనులెత్తి చూడక నిరాదరించెను. అందులకామె కోపించి " తండ్రీ! నీదేహ సం

బంధమగు నాతనువ్రను విడచెదను. ఇదియంతయు ననర్థకము గాక అసికాలి బొటన వ్రేలి గోట నేల వ్రాయుచు యజ్ఞకుండమునబడి యంతర్హితయై హిమవంతుని కుమారియై పుట్టెను. దీనినంతయు శివుడు దివ్యదృష్టిచే నెఱింగి కోపించి మంత్రాక్షతలు * శిలపై జల్లెను. అంతట వీరభద్రుడు ప్రళయరౌద్రాకారుండై యందుబుట్టి హరుని యాజ్ఞచే దక్షుని యజ్ఞవాటిక కేగి ఋత్విక్కులగు దేవమునిసమూహము నెల్ల ఛిన్న భిన్నములు గావించి యజ్ఞము ధ్వంసముచేసి దక్షుని శిరము ఖండించి హోమమునకర్చెను. అంతట దక్షుని భార్య పతిభిక్ష వేడఁ గరుణించి శివద్వేషియై పరిభవ మొందినందులకు గురుతుగ, నెల్లపుడు తలవంచి తిరుగుచుండునట్లు చేయనెంచి తలవంచి తిరుగునది గొర్రెకాన దానితల తెచ్చిపెట్టి దక్షుని బ్రతికించి మరల శివుని దండకేతెంచెను. నాటనుండియు 'పిలువని పేరంటమునకుఁబోరాదు," "నేల వ్రాయరాదు" అను లోకోక్తు లిప్పటికిని వాడబడుచున్నవి.

పిదప శివుడు శాంతి వహించి బ్రహ్మచర్యముఁ దాల్చి దక్షిణామూర్తిగా నవతరించి గురువుయొద్ద బాలుడై సమస్తవిద్యలు నేర్చి కైలాసమున సప్తమావరణంబున సమాధి నిష్ఠుండై యుండె.

---

* (1) వీరభద్రవిజయమున జడజెఱికి శిలపైఁగొట్టినట్లును, (2) చెమటకీసి శిలపై జల్లినట్లు నరసింగయ్యగారి గ్రంథమునందును గలదు.

## రుద్ర శిఖరము

అట్టియెడ బ్రహ్మ, విష్ణువులు, సనకసనందనాది పరమహంస లును, వాలఖిల్యాది యోగసిద్ధులును, నారదాది దేవఋషు లును, వశిష్ఠాది బ్రహ్మఋషులును, మేధాది ప్రధాన రాజ ఋషులును దక్షిణామూర్తి కడ కేగి మోక్షబ్రహ్మోపదేశము సేయుడని వేడ నాతండు నట్లే యంగీకరించి వారి నందఱిం దోడ్కొని యీత్రికూటాద్రియందు నిలిచెను.

అందు రుద్రుండు (దక్షిణామూర్తి) మత్స్యశిఖరము (రుద్రశిఖరము అనగా ప్రాతకోటీశ్వరునిబోడు) నబిల్వ వనాం తరమున బ్రహ్మాసనాసీనుడై యోగనిష్ఠుడై యెల్లరకు మౌన ముద్రచే బ్రహ్మోపదేశ మొనర్చెను. ఇదిబ్రహ్మచారియగు దక్షిణామూర్తి క్షేత్రమగుటచే కళ్యాణోత్సవమును ధ్వజమును యీ స్థలమున లేవు.

## గురునాథ భైరవు లక్షణ

ఈ దక్షిణామూర్తి దేవాదులకు నెల్ల గురువగుటచే శబ్దార్థమును బట్టి గురునాథస్వామియు దక్షిణామూర్తియు నొకరేయని యొకవాద మంకురించెను కాన గురునాథుని వృత్తాంతమింతు వ్రాయుట యవసరమనియెంచి యిందు వ్రా సెదను. గురునాథుని పొంగళ్లు పెట్టునాచారము మన దేశ మున నాలుగువర్ణములందుం గలదు కాని మూలతత్వ మెఱింగిన వారరుదు కాన విచారించగనిట్లు తేలినది.

కూర్మపురాణము ౨౮ వ అధ్యాయమున గురునాథ వ్రతకల్పమును లోపాముద్రకు అగస్త్యుడు చెప్పినట్లుగ నీవిధమున గలదు.

మున్ను సముద్రమథన కాలమున బుట్టిన అమృతమును దేవాసురులకుఁ బంచనవతరించిన మోహినిని శివుడు మోహించి మేరునగ ప్రాంతమునగల దారుకావనమున విహరింప దీర్ఘసంగమమునకు మోహినికి చెమటలు గ్రమ్మి గండస్థలములపైనుండి కాలువలై పారి గండికి నదియేర్పడెను. (ఇదియే సాలగ్రామోత్పత్తి స్థలము) పిదప సద్యోగర్భమున మార్గశీర్షమాసమున ధనుర్వ్యాప్తపూర్ణిమ గురువారము ఆర్ద్రా నక్షత్రమున రావియాకులందు మోహినికి మగశిశు వుదయించెను. వానికి మూడు నేత్రములును, నాలుగు భుజములును, త్రిశూలము ఖడ్గమును, కలిగి శివకేశవులకు సమానమగు రూపమున ౧౭ సం॥ వయస్సుగల బాలకుడై నిల్చియుండెను. వానికి "శాస్త్రి" అనియు గురునాథుడనియు శివుడు నామకరణము చేసెను. అతడు నాకేమియాజ్ఞ యని శివు నడుగ నీవు ప్రమథులకు నాథుడవై భక్తులచేఁ గొల్వబడి వారికోర్కెల నెరవేర్చుచు నాలువేషమువై కైలాసమున నుండుమని యానతిచ్చెను. బ్రహ్మచారియే కాని భార్యలేదు. నాటనుండి గురునాథుడు శివస్వరూపమున బూజింపబడు చుండెను. తక్కిన వ్రతాదులవలె దీనికిని వ్రతోద్యాపనలును కథాకల్పములును గలవు.

వ్రతము (పొంగలి) చేయువారింటి యందు అలికి రంగవల్లులు దీర్చి భక్తిచేబరిశుద్ధులై (పురుషులు మాత్రమే)

విఘ్నేశ్వర పూజచేసి సంకల్పయుక్తముగ అఖండదీపము పెట్టి గురునాథుని విగ్రహమును బంగారుతోగాని, పసుపుతోగాని యమర్చి కుడివైపున త్రిశూలమును, యెడమను ఖడ్గమును పెట్టి పూజించి పొయిలో నగ్ని స్థాపనచేసి గోక్షీరముచే చరవు (తప్పేల) నందు వారి వారి సాంప్రదాయానుసారముగ పాలు పొంగిన పిదప బియ్యము పోసి పాయసము (పొంగలి) వండి పూజా నివేదనములు చేసి బ్రాహ్మణ భోజనమున విని యోగము చేయవలయునని కూర్మ పురాణమున గలదు.

## —: భైరవుడు :—

ఈసందర్భమున శివునకు బుట్టినవాడు భైరవు డందు రే యిది యేమి యని మఱి యొక ప్రశ్నవచ్చి నందువలన భైరవుని కథయు నించుక యెత్తవలసి వచ్చెను. ఈకథ కాశీఖండమున నిట్లు గలదు. బ్రహ్మ అహంకారమున నేనే మూలపురుషుడనని శివు నెదుట వివాదమున గర్వించి యుండ శివుని రౌద్రదృష్టినుండి యొకపురుషుడుజనించి శివుని నిందించుచున్న బ్రహ్మయొక్క పంచమ ముఖమును ఖండించెను. అంతట బ్రహ్మహత్యాకపాలములు వెంటనంటగా భైరవుడు అనేక తీర్థక్షేత్రములు సేవించి తుదకు కపాలమోక్షతీర్థమున గ్రుంకి వానిని వదలించుకొనెను. ఇదియే బ్రహ్మకపాలస్థలము. ఈకథ "పూర్వగాథాలహరి" అను గ్రంథమున విపులముగ వేరువిధమునగలదు. ఇందు వివరించుట యనవసరమని విడువబడినది.

## విష్ణుశిఖరము

విష్ణుదేవుడు రుద్రశిఖరమునకు ప్రక్కనగల విష్ణుశిఖరమున (పాపవినాశన స్థలశిఖరము (గద్దలబోడు) వసించి శివుని గూర్చి తపము చేయ నతడు ప్రత్యక్షము కాగా నింద్రాది దేవత లిచటికి వచ్చి శివుని దర్శించి తాము మున్ను దక్షాధ్వరంబునహావిర్భాగంబులు భుజించిన పాపముల బాపి లింగ రూపమున నెల్లపుడు దర్శనం బీయుమని వేడిరి. అపుడు శివుడొక ఆత్రిపై త్రిశూలమున బోడున నుదక ముద్భవించెను. శివుడు లింగ రూపమున వెలసెను. ఇట్లు వెలసిన శంకరుడు దేవేంద్రాదులను గాంచి మీరెల్లరు నీజలమున స్నానమాడి నన్నారాధించిన మీపాపము నాశనమవునని యానతిచ్చి అంతర్హితుడయ్యెను. వారునుయట్లేయొనర్చి పాపవినాశనము వసిసి పవిత్రులైరి. అప్పటి నుండియు నీక్షేత్రమునకు పాపవినాశనమనియు నాలింగమునకు పాపవినాశనేశ్వరుడనియు పేర్కొను చుండిరి. అందువలననియ్యది ప్రథమ గణనీయమైనది. తొలుదొల్త భక్తులిచట స్నానమాడి స్వామినిసేవించి పిదప కోటీశ్వరుని దర్శింతురు. ఇది ముఖ్యాచారమని పురాణమునవ్రాసిరి.

ఇచట దేవ గరుడ గంధర్వ సిద్ధ సాధ్యాదులెల్ల నిరంతరముందురు. ఇచట కార్తీక మాఘ మాసములయందు స్నానమాడిన భోగమోక్షములు సిద్ధించును.

## బ్రహ్మశిఖరము

రుద్ర శిఖరమునకు దిగువ నైఋతిని గల శిఖరమున బ్రహ్మ వసించెను. రుద్ర విష్ణు శిఖరములపై జ్యోతిర్లింగము

ఏర్పడి యిచట లేకుండుటచే బ్రహ్మ విచారమొంది శివుని గూర్చి తపముచేసి ప్రత్యక్షమైన శివుని లింగరూపమున నిచట వెలయుమని వేడ నట్లె లింగరూపమున వెలసెను. * ఇదియే నూతన కోటీశ్వర లింగము. ఇచట బ్రహ్మాది దేవ ముని గణం బెల్లఁ బరివేష్టించి యుండిరి. శివుడు తాండవించుచుండును. ఎల్లమునులు మంద (గుంపు) గా నుండుటచే నీక్షేత్రమునకు ఎల్లమంద యనియు "మునిమంద" అనియు నీకొండకు నుత్తరమునగల గ్రామమునకు "ఎల్లమంద" అనియు వాడబడుచున్నది. ఇట్లీమూడు శిఖరములందు దేవ పూజితములగు జ్యోతిర్మయ మహాలింగము లేర్పడి నరులకగోచరములై యుండుటచే మనుజులు శిలాలింగము లేర్పరచి పూజించుచుండిరి. వీనివివరములు తెలియవు. ఇవి సురనర సేవ్యములగుటచే నెల్లపుడు సేవార్హములై మోక్షప్రదములగుచున్నవి. ఈ గిరిస్థలమున నిప్పటికి నొక సిద్ధుడు గలడని పెద్దలు చెప్పుదురు. ఇప్పటికి ౧౦ సం॥ల క్రిందట మహామంత్ర వేత్త యగు బ్ర॥ భారతుల నరసింహ శాస్త్రులుగారు నూతన కోటీశ్వరుని గుడియందనుష్ఠానము చేయుచుండగా జపమున సిద్ధుడు గోచరించెనని వారు చెప్పిరి.

దేహమునకు త్రికూటస్థానమందు ఓంకారము ప్రాముఖ్యమైనట్లు యీత్రికూటాద్రికి ముఖ్యమై సమీపమున దక్షిణాముగ ఓంకార నది (ఓగేరు) ప్రవహించుచున్నది. దీని స్నాన

---

* ఈశిఖరమున గల లింగమును సాలంకాయన్య ప్రతిష్ఠించినట్లుగ నారని కథయందు గలదు.

మాడి తీర్థశ్రాద్ధములొనర్చి కోటీశ్వరుని సేవించినవారికి పితృదేవతలు స్వర్గస్థులగుటయే కాక మోక్షముసిద్ధించును.

ఈనది యుత్పత్తి స్థానమగు చేజర్ల (చేరుంజర్ల) క్షేత్రమును యిచట శివైక్యమైన శిబిచక్రవర్తి వృత్తాంతమును నీకథ చివరభాగమున వ్రాయబడినది.

## మూడవ ప్రకరణము

### సాలంకయ్య కథ.

ఈ పర్వతమునకు ఉత్తరదిశను గల "ఎల్లమంద" గ్రామమున * కలియుగాదిని భక్తకుల (లింగబలిజ) జుండగు కోరె సాలంకయ్య యనుశివభక్తుండు గలడు. అతనికి నలుగురు తమ్ములుండిరి. అతడు తమ్ములతోఁగూడి అడవికేగి కట్టెలు తెచ్చుకొని అమ్మి జీవింపుచు నానాట ద్రవ్యమార్జించి భాగ్యవంతుడై సదా జంగమార్చన సేయుచుండెను.

అతడొకనాడీపర్వతమునకు గట్టెలకుఁ బోయి మధ్యశిఖరము (రుద్ర శిఖరము) నకు వచ్చి యందుగల శివలింగమును †బూజించి చనెను. నాడతనికి లాభకరముగా నుండ నాటనుండి నిత్యము నచ్చటికేగి శివుని భక్తి మెయిం బూజింపుచుండి యొక దినమున బుష్పములకై తమ్ములనుగూడి విష్ణుశిఖరము (గద్దలబోడు) నకుఁ బోగా నచట విపరీతమగు నురుములు మెఱుపులతో వర్షము కురిసెను. అతడా ధాటికి వెఱచి తమ్ములు దాను నొక గుహ జొచ్చి; యింటికేగుట శక్యము గాదయ్యెగదా యిచటనే మృతినొందుదుము కాబోలునని చింతిల్లుచు త్రికోటీశ్వరుని స్మరింపుచుండ వర్షము కొంత వడికి వెలిసెను ఇది యంతయు శ్రీ కోటీశ్వరు సనుగ్రహమేకదాయని సంతసింపుచు దారినె వచ్చుచుండ నొక సెల యేటిచే నున్నమైన యొక తిన్నెయందు ధనపుబిందె దొరికెను.

---

* సాలంకయ్యాది సత్తెనపల్లి తా॥ కొమిరెపూడి అని రూపెనగుంట్ల తా॥ రామయ్యగారు వ్రాసిరి. †ఈ లింగము నెవరు ప్రతిష్ఠించినది తెలియదు

ఇది శ్రీ కోటీశ్వరు ప్రసాదముకదా యని స్వీకరించి స్వామి సన్నిధికేగి పూజించి యింటికివచ్చి భాగ్యముస దుల దూగుచు మహా వైభవోపేతుడై పుణ్యకథాశ్రవణ దానధర్మ జంగమార్చనలచే ప్రొద్దుపుచ్చు చుండెను.

ఇట్లుండ నొకనాడొంటరిగా శివ పూజకై రుద్రశిఖర మున కేగి మునుపటివలెనె శివుని బూజించ నందొక జంగమ మూర్తి ప్రత్యక్షమయ్యెను. అతని శ్రీ పరశివునిగా భావించి స్వామీ! మీరు నా యింటికి దయచేసి నా సపర్యలం గొని నా విందు లారగించి నన్ను గృతార్థుని చేయుడని వేడుటయు నాత డట్లే అంగీకరింప సాలంకయ్య జంగమయ్యను తన యిం టికిఁదెచ్చి పరిచర్యలుచేసి అతడు క్షీరమాత్రాహారియగుటచే క్షీరములర్పించి భుక్తశేష క్షీరములను తాను పుచ్చుకొని కాలము గడుపుచుండెను. అంత నొకనాడా దివ్యపురుషుం డంతర్థానుండగుటయు సాలంకయ్య ఆతనింగానక మిగులఁ జిం తిల్లి పర్వతప్రాంతములంతట వెదకి వెదకి వేసారి యెచటను గానక విచారమున నిరాహారుండై యుండె.

గొల్లభామ (ఆనందవల్లి) కథ.

ఈతడిట్లుండ నీపర్వతమునకు దక్షిణమునగల కొండ కావూరను గ్రామమున "సునందు"డను యాదవుడొకడు కల డు. అతడు "కుందరి"అను ధర్మపత్నియందు "ఆనందవల్లి" అను పుత్రికం గాంచెను. నాటనుండి యాతని కభివృద్ధైశ్వర్య



గొల్లభామకోవెల దృశ్యము.

ము లుపాసించుచుండెను. ఆబాలిక చిన్ననాటనుండియుఁ గేవల శివభక్తురాలై తా నాటపాటలయందుసైతము శివుని ధ్యానింపుచుఁ దా నొనర్చు పనులన్నియు శివార్పణము గావింపుచు వస్త్రభూషణ మాల్యాంబరాదుల నిచ్ఛగింపక విభూతి రుద్రాక్షమాలికలం దాల్చుచు శివస్తోత్రములం బాడుచు నిత్యము చెలికత్తెలతోఁగూడి శ్రీ కోటీశ్వరుని కొండకుం * జనిస్వామినిఁబూజింపుచువచ్చుచుండెను. తల్లిదండ్రులు అమ్మా! మనకుగల సమస్త భోగభాగ్యముల నొల్లక యిట్లుల విభూతి రుద్రాక్షలందాల్చి యోగినివగిది నుండెదవని యెంత చెప్పినను వినక వైరాగ్యమును భక్తినీతి వాక్యములు చెప్పుచుండ వారునువిని శివభక్తిపరులైయుండిరి. ఆకన్య యొక మహాశివరాత్రి దినమున ఓంకారనది (ఓగేరు)ని స్నానమాడి రుద్రశిఖరమున కేగి యచట బిల్వవనాంతరమున శ్రీ దక్షిణామూర్తి రూపమున నుండిన శ్రీ కోటీశ్వరుని పూజించి యొక బిల్వవృక్షముక్రిందఁ దపోనిష్ఠచే నిమీలితనేత్రయైతప మొనర్చి కనులు తెరువఁ బూర్వమున సాలంకయ్యకు దర్శన మిచ్చిన జంగమయ్య రూపమున నొక దివ్య పురుషుఁడు ప్రత్యక్షుమయ్యెను. మున్ను సాలంకయ్యకు దర్శనమిచ్చి యాతని యింట విందులారగించిన జంగమయ్య యితడే కాబోలు నని యోజించి నిత్య మాతనికి పాపనాశనద్రోణిక (దొన) తీర్థమును రుద్రశిఖరమునకుఁ దెచ్చి యభిషేక మొనర్చి క్షీరములర్పించిభుక్తశేషమును దా భుజింపుచుఁ గాలముగడుపుచుండెను.

---

* పాత కోటీశ్వరుని కొండకని గ్రహింపునది

కొంత కాలమున కీవృత్తాంతము సాలంకయ్య యెఱిగి పూర్వము తనకు దర్శనమిచ్చిన మహాపురుషుడీతడే కాబోలునని యెంచి గొల్లభామ (ఆనందవల్లి) కడకువచ్చి తనవిషయముం జెప్పి అమ్మా! నీచే బూజ పడయుచున్న జంగమమూర్తికి దగుసమయంబున నన్నెఱిగింపుము; అంతదాక నేనిచటికి వచ్చుచుండెదనని చెప్పెను. కానిఆజంగమమూర్తి మౌనముద్ర ధరించి యుండుటచే నీయమకు సమయం బొనకూడదయ్యెను. కొంతకాలమునకు గ్రీష్మఋతువురాగా గొల్లభామ వివిధ శ్రమలకోర్చి పాపవినాశన తీర్థాభిషేకమును క్షీరనివేదనమును మానకచేయుచుండెను. ఒకనాడు పాపవినాశనము నుండి తీర్థఘటమును శిరమున నిడికొనివచ్చి జంగమయ్య సమీపమున నొకచోటదించి బిల్వములకై పోగా నొకవాయసమాకుండపై వ్రాలగా బోర్లపడి తీర్థమెల్ల నేలపాలయ్యెను. అందులకాయమ మిగుల చింతిల్లి "ఇంతటనుండి యిచ్చటికి వాయసములు రాకుండుగాక" యనిశపించెను. నాటనుండియు నిచటికి వాయసములు రాకుండుట యిప్పటికి నిదర్శనమని చెప్పెదరు. దీనినంతయు నాజంగమ రూపుండగు శంకరుడెఱింగి కరుణించి కన్యకనిచటికి రాకుండునట్లుచేసి యీయామ శ్రమమాన్పింపదలచి యిట్లనియె. "తల్లీ నిండుప్రాయమున నున్నదానవు యింటనుండి మెండగు సుఖములందేలక యిట్టినిరర్థకములగు శ్రమలుబడెదవు? అడవులనుండు మునులము నీకేమి మేలుసేయగలము? ఇదియంతయు నిష్ప్రయోజనము కావున నీసేయు పూజనాదులుమాని యింటికేగి సుఖంబుండుమని చెప్పెను. ఆయమవిని తండ్రీ? దేవర సేవకన్న

శాశ్వతసుఖమెద్ది? యింటఁగల సుఖములన్నియు నస్థిరములు కావా? అనిచెప్పి నిత్యమును యథాప్రకారము సేవింపుచుం డెను. ఆమహాపురుషుఁడీబాలికకు జ్ఞానోపదేశ మొనర్చి నయెడల విజ్ఞానియై పూజనము మానునేమోయని యెంచి యీమెసమ్మతమున జ్ఞానోపదేశము సేయ నాకన్య గ్రహించి మిగులభక్తి ప్రపత్తుల కలదై "స్వామీ! తాముదైవ స్వరూపులేకాక నాకుగురువులుకూడా నైతిరి గురువును వి డనాడుట మిగుల దోషముకాదా? అది గురుద్రోహమును కాదా? అనిచెప్పుచు మిగులశ్రమలకోర్చి పూర్వప్రకారము పాపవినాశన తీర్థాభిషేక పూజాని వేదనాదులుచేయుచుండెను. అందులకాతఁడు విచారించి యీమెశ్రమ యెట్లువారింప వచ్చునాయని యోజించి నిత్యము గిరికిరాకుండునట్లు తనయోగ మాయచే నస్ఖలిత బ్రహ్మచారిణియగు నాకన్యకు మాయా గర్భమును కల్పించెను. ఆమెనానాట గర్భభారమును వహింపుచు నవమాసపూర్ణియైనను శ్రమకోర్చి నిత్యవ్రత ముమానకుండెను. అంతనామునీంద్రుఁడచ్చెరువొంది కరుణించి యిట్లనియె. "తల్లీ! నీవునాకై శ్రమపడి యిచటికి రానేల? నేనేనీయింటికి వచ్చెదను. నీయింటనే నీవ్రతము నెరవేర్చుకొనుచుండుము నేనునీవెనుకనే వచ్చెదను నీవుతిరిగి చూడక పోవుచుండుము తిరిగిచూతువేని నెంతవరకు వచ్చుచుందునో అంతటనే నిలచెదను" అనిచెప్పి ముందు గొల్లభామయు వెనుక ప్రళయధ్వనులు మ్రోగుచుండ నామహామునియు రుద్ర శిఖరమునుండి వచ్చుచుండిరి. ఇట్లుబ్రహ్మ శిఖరము వరకు వచ్చు సరికి వెనుకనుండి వినవచ్చు ఘోరధ్వనికాయుబల యో

ర్వజాలక నిబ్బరముమాని తిరిగిచూచెను అంతటనాతడచటనే నిలిచి "తల్లీ! నీవు తిరిగి చూచితివి ప్రతిన భంగమయ్యె నేనిక రానొల్లను. ఇచటనే సమాధినిష్ఠచేసెదను." అని బ్రహ్మశిఖర మునగల బిలమున నిల్చెను (ఇదియే నూతన కోటీశ్వరాలయ స్థలము. ఇచట నొక బిల ముండినట్లు గ్రహింపనగును.) గొల్లభామయు నిలచెను యీ నిలచినచోట యింతలోనొక కుమారుడు కలిగెను. ఆ ముని రాకుండుటయు దానుప్రసవము గుటయు గాంచి వగచి "వ్రతభంగ మొందితిని నేనెట్టులీ యిహామందు జీవింపగలను నేనిచటనే ప్రాయోపవేశ మయ్యెద గాక" అని మానముద్రిదాల్చి యోగముపట్టి కనులు తెరుచు నంతలో దనకుమారుం డదృశ్యుండై తాను కన్యత్వమున నే అ నాయాసముగా నిలుచుండెను. అందులకాయమ మిగుల నా శ్చర్య మొంది యిది యంతయు నా ధైర్యస్థైర్యములం బరీక్షిం చుటకై ఆ మహామహుడొనర్చిన మాయకాని వేరొండుకాదు ఇతడు సాక్షాత్కోటీశ్వరుడు నాజన్మ సఫలంబయ్యె నేనును యిచటనే విదేహకైవల్య మొందెదనని సమాధిబూని శివై క్య సంధానము నొందెను.

## సాలంకయ్య చివరకథ.

ఇచట సాలంకయ్య నిత్యమును గొల్లభామకై వేచి యుండుటయు నాయమ జంగమయ్యకుం దన వృత్తాంతము నెఱి గింప నవకాశము కలుగ లేదని చెప్పుటయు గల్గుచుండెను. ఇట్లుండ నాటిదినమున నెంతవట్టునకును గొల్లభామ రాకుండు

టకెంతయు విచారించి వెతకుచు సాలంకయ్య బ్రహ్మశిఖరము నకెక్కి యచట గుహాయందుగల యతీంద్రుని (గొల్లభామ వెనువెంటవచ్చి నిలిచిన జంగమయ్యను) చూచి నమస్కరించుటయు నా యతీంద్రుండాతని కిట్లనియె. "అయ్యా! నీకు నేను పూర్వము దర్శనమిచ్చి నీ యింటఁ గతిపయదినములుండి యంతర్ధానుండనై వచ్చి రుద్రశిఖరమునం జేరి గొల్లభామకు దర్శనమిచ్చి ఆయమకు వ్రతసమాప్తి నొందించితి. నేను శివుడను ఆయమయు శివైక్యసంధానము చేసెను. నీయభిమత మెఱింగితిని. నేనిచట నే నిలువగోరితిని కావున నీగుహపై గుడి కట్టి యందు త్రికోటీశ్వర లింగమును బ్రతిష్ఠించి * పూజింపుచు శివరాత్రి దినమున ఓంకార నదిని స్నానమాడి సన్నభిషేచనాములచే బూజించి యుపవాస జాగరణాదులొనర్చి ప్రభలు కట్టించి వీరాంగాది వివిధ వాద్యములచే నుత్సవములు దానధర్మములు చేసి మరునాడన్నదాన మొనర్పుము నీవును శివైక్యము కాగలవు. ఆ గొల్లభామయు మార్గమధ్యమున సమాధి చేసెను. ఆయమ నా భక్తురాలగుటచే జనులెల్లఱు ముం

---

* దీనిని బురస్కరించుకొని కాబోలు నిది సిద్ధక్షేత్రము కాదనియు సమాధిపై స్థాపితమగు లింగమనియు నొకరనిరి కాని త్రికోటీశ్వరుడు యోగి రూపమున బ్రత్యక్షమై గుహంజొచ్చి యదృశ్యుండైనట్లు చెప్పుటచే సామాన్యమానవుని సమాధిపైనిల్పిన లింగమువలె నెంచుట సమంజసముకాదు. సాలంకయ్యయే లింగప్రతిష్ఠ చేసినట్లు కథాభాగమున గలదు. పైన జెప్పబడిన సిద్ధు డిప్పటికిని సంచరింపుచుండెనట్లు పెక్కురు చెప్పుదురు. సిద్ధుని దర్శించిన విషయము రెండవ ప్రకరణము చివరభాగమున వ్రాయబడినది.

దుగా నామెను దర్శించి పిదప నన్ను సేవింపుచుండునట్లుగా నచట గుడికట్టి గొల్లభామ విగ్రహమును బ్రతిష్ఠించి పూజింపు చుండుము" అని యానతిచ్చెను.

అంతట సాలంకాఖ్యుండు బ్రహ్మానందభరితుడై దేవా! అట్లే చేసెదను నాకు ముఖ్యమగు శివైక్య సంధానస్థితి నుపదే శింపుమని వేడ నా మహనీయుండు నతని కుపదేశమును గ్రహించి యంతర్థానుడయ్యెను.

సాలంకయ్యయు ద్రవ్యము విరివిగ వెచ్చించి గిరిపై కోవెలలు నిర్మించి గొల్లభామ కోటీశ్వర ప్రతిమల బ్రతిష్ఠించి పూజింపుచు నెల్లవారికి కోటీశ్వర మహిమాదులు బోధింపుచు మునీంద్రు డానతిచ్చిన విధమున ప్రభల గట్టించి యుత్సవాదులు చేయుచు కాలము గడుపుచుండెను. పూజాకాలమున నితనికి సిద్ధుల దర్శనమగుచుండెడిది. అతడు శివరాత్రినాటి స్నానపూజా మహోత్సవాదులకెంతయు దనివిజెందక శ్రీకోటీశ్వరునకు కళ్యాణ మహోత్సవమొనర్చిన మిక్కిలి చొక్కముగ నుండునని యెంచి యీశ్వరునకుం బశ్చిమమున గోవెల గట్టి యందు బార్వతిని బ్రతిష్ఠింపబూనుటయు ఆకాశవాణి "ఈ స్థలము బ్రహ్మచారియగు దక్షిణామూర్తి క్షేత్రము ఇందు గళ్యాణము సేయదగదు" అని చెప్పెను దాని నాతడు చెవి నిడక తన వాంఛాబలమున పార్వతి ప్రతిష్ఠ గట్టిగ సేయనెంచి విగ్రహమును నిర్మించియుంచగా నది మాయమయ్యెను. అందులకాతడు మిగులం జింతిల్లి విరక్తుండై దేహత్యాగము చేయ

దలంచి యోగముబూని శివైక్యమయ్యెను. తన తమ్ములుముగ్గురును అచటనే లింగైక్యమయిరి. సాలంకుండు సాలంకేశ్వరుడను పేరను ఇతడు ప్రతిష్ఠించిన లింగమునకు త్రికోటీశ్వరుడను పేరను ఇతని తమ్ములుముగ్గురును బ్రహ్మ విష్ణు మహేశ్వర లింగములను పేరను వెలసిరి. ఇందువలన నిది పంచబ్రహ్మస్థానమని పేర్కొనబడినది. (దేవాలయములు అను భాగమున నీలింగవివరములు చూడనగును) ఇచట త్రిమూర్తులును అష్టదిక్పాలురును మొదలగు సమస్త దేవతలును వచ్చిస్నానమాడి కోటీశ్వరునిబూజించి యుత్సవాదులొనర్చురు. ఇది దేవోత్సవము పిదప మానవులు ప్రభలుకట్టి మహోత్సవము చేయుచుండిరి * ఇది మానవోత్సవము. ఈప్రభలుకట్టువిషయము ముందురాగలదు శ్రావణమున రుద్రశిఖరమునను కార్తీకమున విష్ణుశిఖరమునను మాఘమున బ్రహ్మశిఖరమునను నిలిచి మహాలింగార్చనము చేసి అన్నదానము చేయువారికి మోక్షము సిద్ధించునని స్థలపురాణమున గలదు.

## ప్రభలుకట్టుటకు కారణము

మనదేశమున ఈశ్వర సేవాసందర్భమున ప్రభలను అమ్మవారి కొలుపుల సందర్భమున కుంకుమ బండ్లను కట్టి యు

---

* ఈ శివరాత్రి ప్రభల ఉత్సవము సాలంకయ్యయే మొదలిడినట్లు కనుపట్టుచున్నది. కాలనిర్ణయ మెఱుకకు నాధారములు లేవు.

త్సవము సేయు నాచారముకలదు. ఇందుల కేదేని శాస్త్రాధార ముండియుండునని యెంచి యెందరిని విచారించినను సరియగు నాధారము తెలదయ్యెను. కాని పలుమంది పలువిధములుగ జెప్పిరి. ఏవియు సిద్ధాంతపరుపఁజాలకున్నవి. కుంకుమబండ్ల విషయ మసలే తెలలేదు. ప్రభలను గూర్చి మూడు విధములుగఁ జెప్పబడినవి.

(1) కర్రజాతిలో నెల్ల వేణువు (వెదురు) కృష్ణుడు పూరించుటవలన బూజ్యమైనది కాన దానిని వస్త్రాలంకారముతో లింగాకారముగ నమర్చి సేవించిన శివప్రీతికరమని శైవపురాణములందుఁ గలదనియు నందువలన నిట్లు శివాకారముగ ప్రభలు కట్టుట యాచారమైనదని యొక ఆరాధ్య అయ్యవార్లంగారు చెప్పిరి. ప్రభశబ్దార్థమీందుకు సంబంధించుట లేదు.

(2) శివసేవకు ప్రభ నొక వాహనముగానమర్చి దానిపై ననేక దేవతా విగ్రహముల నెంచేపుచేసి యుత్సవముచేయు నాచారము తూర్పు దేశమున గలదట. ఇందు ప్రభను శివునిగా భావించుట లేదని స్పష్టము.

(3) దక్షాధ్వర ధ్వంసమునకై శివుడు కల్పించిన వీరభద్రావతారము భయంకరమగు నాయుధములును గంటలు మొదలగు ధ్వనులు ఘోరమగు నార్పులును గలిగి దీర్ఘాకారమున వెలువడిన కారణమున తత్ప్రత్యామ్నాయముగ ప్రభలను నిర్మించి రౌద్రరసప్రధానములగు వాద్యములు, ఖడ్గములు, నారసములు మొదలగు సేవల నొనరింతురని యొకమతము. ఈ విషయమింక విమర్శనీయముగ నున్నది.



శివరాత్రి సంబల మహోత్సవ దృశ్యము.

## నాల్గవ ప్రకరణము.

### ఓంకార నది.

ఓంకారనది ఓగేరు అనుపేర నర్సరావుపేట తా॥ చేజెర్ల లోని కపోతీశ్వరుని గుడిప్రక్కనుండి ప్రవహించి కోటీశ్వరుని కొండ సమీపముగా వెడలి సముద్రమున గలియుచున్నది. పూర్వము శిబి చక్రవర్తి లింగైక్యమై స్వయంవ్యక్త లింగముగ కపోతీశ్వరుడను పేర చేజెర్లయందు వెలసినపిదప నా లింగమూర్తికి సిద్ధ సాధ్య దేవ గంధర్వ ఋష్యాదులు ఓంకార శబ్దోచ్చారణతో నభిషేకముచేయ నాజలము భూగతమై లింగముక్రిందుగ నదీ రూపమున వెలువడుటచే "ఓంకారనది" యనబడినది. ఈ వృత్తాంతము నిందు వ్రాయుచున్నాను.

### శిబి చక్రవర్తి కథ.

పూర్వము భరత ఖండమున శిబి చక్రవర్తియను నొక రాజేంద్రుడు గలడు. అతడు అగస్త్యుని యుపదేశమునొంది శివభక్తుండును జగదేక దాతయునై ఆర్తరక్షకుండను బిరుదు వడసి ప్రసిద్ధికెక్కెను. ఇతని దాన శీలత్వము బరీక్షించుటకై శివుండు కిరాత వేషధారియై * అగ్నిహోత్రుని గపోతముగా గైకొని వేటాడుచు వచ్చెను. ఆ కపోత మీ కిరాతునిచేబడి తప్పిపోయి యీ రాజు కడకు వచ్చి శరణు జొచ్చెను. ఇతడు కరుణించి దానిని రక్షింప నెంచి తనకడ నుంచుకొన నా కిరా

* ఇంద్రుడు శ్యేనమై (డేగ) కపోతమును వేటాడినట్లు భారతమునను యీ స్థల పురాణమునను గలదు.

తుడువచ్చి పక్షి నిమ్మని వేడ నాతడందుల కంగీకరింపక నీవు కోరెద వేని దీనియెత్తు మాంసము నా దేహమునుండియైన దీసి యిచ్చెదఁగాని యీ పక్షినిమాత్రి మీయననెను. అందులకా కిరాతుఁడు సమ్మతింప రాజేంద్రుఁడా పులుగును త్రాసునం దునిచి తన దేహమందలి మాంసముతీసి తూచ నారంభించెను కాని యెంతమాంసము పెట్టినను సరిపోదయ్యెను. అంతనతడు చింతించి ప్రాణములు పోవుటకైన దెగించి తలలో నొకవైపు మెదడుదీసిపెట్టి చాలక రెండవవైపు తీయుచుండగా శివుడు మెచ్చి కరుణించి ప్రత్యక్షమగుటయు నారాజు శివైక్యసంధా నము వేడ శివుడట్లేజేసెను. అంత నాతండు శిలాలింగమై పాతా ళమువఱకు నాటుకొని కపోతీశ్వరుడనుపేర వెలసెను. ఇదియే మనదేశమున గల చేజర్ల (చేరుంజర్ల) (గుంటూరు జిల్లా నరస రావుపేట తాలూకా లోని గ్రామము.) ఇచట శ్రీకపోతీశ్వ రుని గుడి కలదు. ఇది తక్కిన వాని వలెఁ గాక గుడిసెవలె నుండును. ఇందు వేశ్వేరు కొండలమీద కుమారస్వామి మేఘాలమల్లయ్యల పురాతన కోవెలలు గలవు.

ఈ లింగము యెవ్వరును ప్రతిష్ఠించినట్లు కాక పుట్టి నట్లుండును. పానవట్టము లేదు. దేహమునిండా గాయములు పడి నట్లు గుంటలు గుంటలుగానుండును. శిరమున రెండుబిలములు గలవు. వానియందొక దానియందొక బిందెడు నీరు పోసినని౦ డునంతటిలోతుగలదై రెండవదియెంతనీరు పోసిననునిండకుండును.

ఇది శిలయని కొందఱును ఎముకయని కొందఱును చె ప్పెదరు చిన్న బిలములోని నీరు తెల్లవారు సరికి చెడువాసన

పట్టును. మరునాడు త్రోడిపోసి కడుగుదురు. పూర్వమొకతూరి యొకరు పరీక్షింపదలచి పలువురు బ్రాహ్మణులచే నీరుపోయించిరనియుఁ గొంతవడికా బిలమునుండి పొగ మంటలు వెలువడెననియుఁ నంతట అపరాధమని శాంతి చేసిరనియు చెప్పుదురు.

ఇచట "పేరులేని పెద్దమ్రాను" ౧౦, ౧౫ మూర్లవలయమును ౩౦ మూర్ల యెత్తునుగల వృక్షమొకటి కలదు. దీనివయస్సింతయని యెవ్వరును నిర్ణయించలేకున్నారు. దీనియాకులు ౩ మొదలు ౧౧ వరకు బేసిసంఖ్యగల దళములు కలిగియుండును పూలు చిత్రవర్ణములు కలిగి కమలములంతవిగనుండును కాయలెన్నడును కానరావు. ౧౨సం॥ కొకపండు పండుననియు దానిని దేవతలు శివునకు నివేదన చేయుదురనియుఁ జెప్పుదురు. ఈ వృక్షవృత్తాంతము గోష్టివనమాహాత్మ్యము (పొన్నూరు స్థలపురాణము)న గలదు ఈ మ్రానునకొక పెద్ద తొఱ్ఱ గలదు. అది అగాధముగా నుండును. దానినుండి కాశీ రామేశ్వరము గుత్తికొండబిలము శ్రీశైలము మొదలగు మహాస్థలములకు మార్గములు కలవనియును పూర్వము అవధూత తుంగదుర్తి బుచ్చయ్యగారను నొక మహాపురుషుడందుండి పోయి శివరాత్రినాడు పైన చెప్పబడిన మహాస్థలములందెల్ల నొకప్పుడే కనుబడుచుండెడివాడనియు చెప్పుదురు. ఈ వృక్షము రాక్షస సం॥ మార్గశిర బ౯ (30-12-1915) దినమున మనుష్యునివలె నొరిగి పడిపోయెను. అంతరక్తముగా నగ్ని పుట్టి దహనమయ్యెను ఈ క్షేత్రము మిగుల పుణ్యస్థలమనియు దక్షిణకాశియనియు చెప్పుదురు. ఇచ్చటి దేవతావిషయ

ము లన్నియు దెలియుటకై యీ బుచ్చయ్యగారు వేయించిన యీదిగువ శిలాశాసన మొకటికలదు.

## చేజర్ల శాసనము

శ్రీ కాళయుక్తినామ*సంవత్సర మార్గశిర శు ౧౦ సోమవారము శ్రీ చేరుంజెర్ల దక్షిణకాశీపుణ్యక్షేత్ర శ్రీమత్క పోతేశ్వర శిబిరాజవరద శ్రీమత్కపోత యీశ్వర శ్రీమన్మహాదేవు నిజమూల భృత్యులయిన శ్రీ దేవదేవ శ్రీసమ్ముఖ శ్రీకరణ శ్రీనమశ్శివాయగారి శ్రీ చేరుంజెర్ల గ్రామము గుడి కట్టులోగా యున్నవి. ఆలయాలు ౭౫। నందులు ౨౫। వినాయకులు ౧౧। భైరవులు ౧౦। కుమారస్వామి ౧। మాధవుడు ౧। గరుత్మాల్లు ౧। లింగాలు ౧౦౦౦౦౦౦౧। దుర్గలు ౬౨। వీరులు ౨౦। నాగన్నలు ౨౦। సూర్యులు ౭। చంద్రులు ౧౧। వీరన్న ౧। అక్కదేవతలు ౨౪। కృష్ణులు ౨। రామలక్ష్మణులు ౪। అనమంతులు ౩। వెంకటేశ్వర్లు ౨। శాసనాలు ౬। వృక్షం ౧। ద్వారపాలకులు ౫। శూలం ౧। స్తంభాలు ౫౧। గుహాలు ౪। మఠాలు ౪। భావులు ౧౦౧। వాగేరు ౧। చెరువులు ౩। కుంటలు ౩౦।.

తుంగభద్ర బుచ్చన్న నిత్యం ౧౦౦౦ నమస్కారములు ఇవిఅన్ని ఉన్నవి. యివి వున్నవి అని యెవరు అందురో కాశీ

---

* ఇది శా॥ శ॥ ౧౭౨౦ క్రీ॥ 1798 కు సరియగు కాళయుక్తి॥

లో ౧౦౦౦ శివప్రతిష్ఠలుచేసిన పుణ్యాన పోదురు. యెవరు లేదంటరో గో బ్రాహ్మణ వధించిన పాపాన బోదురు.

స్వదత్తాద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తానిష్ఫలంభవేత్ ॥
తుంగమ_ర్తి బుచ్చన్న వేయించిన శాసనం.
రంగోజు రాముడు వేశినశాసనం॥
ఇదికాక యింకకొన్ని పూర్వశాసనములుకలవు.

ఈ బుచ్చయ్యాగారినిగూర్చి తెలిసినంతవరకు క్లుప్తముగ నిందు వ్రాసెదను.

ఈయన వినుకొండ తా॥ ఇనుమెళ్ల గ్రామవాసి. నెక రికల్లు వాసియని కొందఱందురు. కరణ కమ్మ వైదిక బ్రాహ్మణుడు. కౌమకాయన విశ్వామిత్రసగోత్రుడు. ఋక్శాఖి. బాల్యమునుండి విద్యాశూన్యుడై వ్యవసాయము చేయుచు చిన్నతనమున ఇనిమెళ్ల ప్రాంతమున కొండల సమీపమున చేను దున్నుచు దాహమై నీటికొరకుఁ గొండలలోని గుహలలోనికిఁ బోగా నచట ఋషులుండి వారి దర్శనమయ్యెను. వారికీయన యందనుగ్రహముకలిగి నాలుకపై బీజముల వ్రాసిరి. మధుమతి విద్య * నుపదేశించిరని ప్రతీతి. నాటనుండియు

* మధుమతి విద్య॥ శ్లో॥ అంజనా కర్షణా ద్వర్గ్య పశ్యవా దేపయస్తుతిం దూరశృతిం దూరదృష్టేహ్యు దూరగమనం తథా।
సాక్షాన్మధు మతీశక్త్ర పరిపస్సంస్థ పరియుస్థతి।
పాతాళలోకసంచారో బిలసిద్ధి ప్రజాయతే। మహిమ్న ఖేచరత్వాది సంచార స్సర్వకామదః। సర్వత్ర సర్వదా సర్వం వ్యక్తిప్రజ్ఞా ప్రభావతా॥
సర్వకోటి మహామంత్రా కాశానాహ్వతి షోడశీం ॥

నీయన విజ్ఞానియు కవియునై మహిమకలిగి కపోతీశ్వరాష్టకమును (శ్లోకములు) కొన్ని కీర్తనలును వ్రాసిరి. అష్టకము నిందు వ్రాయుచున్నాను.

తొలుత కొంతకాలము కుంకలగుంటలో దమ్మవళపు రంగశాయిగారింట నుండి నిత్యము చేజెర్లకుబోయి కపోతీశ్వరున కభిషేకము చేసి భోజనమునకు తిరిగి వచ్చుచుండెడివాఁడు. ఒకదినమున తిరిగిరాక స్వామికడనేయుండ నదివర కీయనను మిగుల ప్రేమతో బోషించుచుండిన రంగశాయిగారు విచారపడి చేజర్ల స్వామిగుడికివచ్చి యీయన నెంతబలవంతపెట్టినను పోక తను వృద్ధుడై మృతివరకచ్చటనే యుండెను. తన యిచ్ఛ వచ్చినపుడెల్ల చుట్టుపట్ల గ్రామములకు వెళ్ళుచు యెచట తటస్థించునో అచట భోజనముఁ చేసి వెళ్ళుచుండెడివాఁడట. ఎల్లగా పొట్టికురుచగానుండి ముల్లుకర్రవంటి కర్రచేతనుంచుకొని తిరుగుచుండెడివాడట. వారు చేర్చిన మధుమతి విద్యాప్రభావమువలన కొన్ని మహిమలు కనుపరచు చుండెడివాడట. వానిని కొన్నిటవ్రాయ నుత్సహించుచున్నాను.

తుంగపర్తి బుచ్చయ్యగారి మహిమలు.

1. శివరాత్రి మొదలగు పర్వములందొకప్పుడే శ్రీశైలము కాశి గుత్తికొండబిలము మొదలగు వానియందు కనుపించెడువాడు.

2. నరసారావుపేట జమీన్దారిణి గారగు శ్రీరాజా మలరాజు లక్ష్మయ్యమ్మారావుగారు వీరియందు గురుభక్తికల్గి

మనస్సంకటములు వచ్చినపుడెల్ల వీరినిపిలిపించి ముచ్చటించెడి వారట. ఒకపరి వారినిపిలువ నంపుటయుఁ బిలువవచ్చినవానితో బయలుదేరి వెనక చిక్కి వచ్చినట్లేవచ్చి అదృశ్యులైరి. అతడు వీరికై వెనుకాడుచు తహతహపడుచుండగా నత్యల్ప కాలములోనే నీతని కెదురుగ వచ్చుచుండిరి. అతడు స్వామీ! మీ రెచటి కేగితిరి? మీకై చూచుచున్నాను పోవుదమురండి యన నేను వెళ్లివచ్చితిని నీవిక యింటికిఁ బొమ్మని సమాధానము చెప్పి పంపిరట.

3. వీరి కొకపరి చలిజ్వరమువచ్చి బాధపడుచుండి యొకనాఁడు తనకర్రను బావియొద్దున గుచ్చి తనజ్వరమును దానికావహింపఁజేసి స్నానాది కృత్యములు తీర్చుకొని తిరిగి కర్రనుండి తనకు వచ్చునట్లు చేసికొనిరట. ఇది యొకరుచూచి స్వామీ! ఇంతటివారేమీరు జ్వరమును రాకుండనే చేసికొనరాదా అనియడుగ ప్రారబ్ధ మనుభవింపక తీరదు. దానిదాట నెవరితరము? అని ప్రత్యుత్తర మిచ్చిరట.

4. ఒకపరి మురికెపూడికి వీరిని పిలునంపబడి పిలువ వచ్చినవారును వీరును గుర్రాలతో చేజర్లనుండి వెడలికోసెడు దూరమువచ్చి అచ్చటనొకచేలో దోసకాయలుకోసికొందమని ప్రేరేపించి దిగి అందరు చేలో కూర్చుని కాయలుకోసినట్లే యుండి చేనిగట్టునకు రాగా రెండున్నర ఆమడలలోగల మురికెపూడిగ్రామ సమీపమున గుర్రములతో నుండిరట. వారప్పుడందరు దిగ్భ్రమజెందిరి. ఇట్టి వనేకములు కలవని పెద్దలు

చెప్పుచుండ వినికిడిపైన వ్రాసితిని. ఆనంద సం॥ భాద్రపద బ ౧ గురువారము (1854 సెప్టెంబరు 17 తేది)న బుచ్చయ్య గారికి ప్రాతఃకాలమున మాడునొప్పి కనుపడి నేడు నిర్యాణ మగును స్వామి దర్శనమగుచుండులాగున ప్రాకారము వెలుపటి మండపముకడ నన్ను బరుండపెట్టుడనిచెప్పి స్వామినిచూచి ధ్యానింపుచుండగనే బ్రహ్మకపాలము భేదించికొని హంస లేచెనట. వీరు బ్రహ్మచారిగనె యుండిరి. వీరికి కోవెల మొదటి ప్రాకారములోపల సమాధిచేసిరి.

వీరి శిష్యురాలు బ్రహ్మచర్ల అచ్చమ్మగారు వీరిపిదప కొంతకాలము చేజెర్లయందే స్వామిని సేవింపుచుండి సర్వజిత్తు సం॥ కార్తిక బ ౧౧ లు శుక్రవారము 1887 సం॥ నవంబరు 11 తేదిన సిద్ధిపొందెను. వీరికి గురువు సమాధికడనే సమాధిచేసిరి.

కపోతీశ్వరాష్టక శ్లోకములు.

౧ శ్రీశైలనాథం భ్రమరాంబికేశం హేమాలయస్థం వరదం ప్రశాంతం। మేఘాలమల్లేశ మహాంగుహేశం ధ్యాయామి చేజెర్ల కపోతలింగం॥

౨ కైలాసశైలే నవరత్నయుక్తే సింహాసనే రమ్యసువర్ణగేహే। ఆసీనమీశం శివమష్టమూర్తిం॥ధ్యాయామి॥

3 శ్రీపార్వతీశం భువనైకనాథం గోవిందసంపూజిత మిందుమౌళిం। శక్రాదిభిస్సంస్తుత మగ్రిగణ్యం॥ ధ్యాయామి॥

౪ బ్రహ్మాది సంసేవిత పాదపద్మం రుద్రాక్షమాలాధర మంబికేశం। భస్మాంగరాగం పరిపూర్ణదేహం ॥ ధ్యాయామి॥

౫ నాగేంద్ర చర్మాంబర మంగజారిం। కాలాంతకం బిల్వవనాంతరస్థం। కర్మాంధనాగ్నిం శివభక్తివశ్యం॥ ధ్యాయామి॥

౬ యోగీశ్వరాణాం హృదయాంబుజస్థం వేదాంతవేద్యం నిజబోధరూపం। ముక్తిప్రదం శాశ్వతశుద్ధలింగం॥ ధ్యాయామి॥

౭ విత్తేశమిత్రం పరమం దయాళుం। గంగాధరంసర్వచరాచరస్థం। శైవాగమస్తోత్రపురాణగుహ్యం॥ ధ్యాయామి॥

౮ దేవాదిదేవం గురులింగమూర్తిం పంచాక్షరస్థం ప్రణవస్వరూపం। ఈశప్రసాదేనసయాతినిత్యం ॥ ధ్యాయామి॥

## అయిదవ ప్రకరణము

## దేవాలయములు (కొండపైని)

ఈ స్థలమున వెలనాటి గొంకరాజు మొదలగు వారి నాటి దీపదాన శాసనము లుండుటంబట్టి ౮౦౦సం॥లకుఁ బూర్వమే కోటీశ్వరుని కోవెలయుండి పూజింపఁబడు చున్నట్లు తెలియుచున్నది. (చూ॥ మెకంజిమాన్యుస్క్రిప్టుస్ వాల్యూం XVIII పుట 256)

ఈ కొండపైన రుద్రశిఖరము (అనగా పెద్దబోడు) మీద నొక చిన్నగుడియు, లింగమును దాని కెదుట శిథిలమగు దారు ధ్వజమునుగనుపట్టుచున్నవి. దీనిని ప్రాతకోటప్పగుడియందురు. ఇదియే మొదట కోటీశ్వరుడుండు స్థలమనియు నిచటనుండియే కోటీశ్వరుడు గొల్లభామ యింటికివచ్చుటకు దిగివచ్చి మధ్య నిలిచెననియుఁ జెప్పుదురు. దీని నిర్మాణమును గూర్చి తెలియరాదు.

బ్రహ్మశిఖరము (మధ్యబోడు) పైన నూతన కోటీశ్వరుని గుడి యిప్పుడుందలు బూజించు దేవస్థలము కలదు. దీని నిర్మాణమును తెలిసికొను నాధారములు కానరావుకాని దీని యందలి శాసనములను (చూ॥ ౮వ ప్రకరణము) బట్టి ౧౧ శతాబ్దమునాటకే గుడి యున్నట్లు కనుపట్టును కాని గురువయ్యపాలెము కాపురస్థులు గ్రంధెవారను వైశ్యులు కలపనిమిత్తమీ యడవికి వెళ్లగా పెద్ద వరషమువచ్చి యొక సెలయేట



ప్రాతకోటీశ్వరస్వామివారి ఆలయము.

...కెబిందెలు కొట్టుకొనివచ్చి వారికి దొరకెననియు వారికి నా ...త్రాత్రి కోటీశ్వరుడొక యోగివలె స్వప్నమునవచ్చి కొండపై ...కు గుడి కట్టింపుడని చెప్పగా వారట్లు చేసిరనియు నొక ...తీతి కలదు. దీనికాధారమేమియు గానరాదు. పైన జెప్ప ...న సాలంకయ్య వృత్తాంతమే యిట్లు చెప్పిరేమో తెలియదు. ...ర్వపు శాసనములనుబట్టి గుడినిర్మాణము చేసిన గ్రంధివారు ...ని సాలంకయ్యగారి ౧౧ వ శతాబ్దికి బూర్వులో కారో తె ...కొనవలసియున్నది.

చెఱువు వేయించిన మాదల శంభులింగమ్మ కోవెల ...నము కట్టించినట్లు ప్రతీతి కలదు.

గుడి దక్షిణ ద్వారబంధమునగల యీదిగువ శాసన ...నుబట్టి యిటీవల సిద్ధ మల్లప్ప (సంతమాగులూరు) కొంత ... చేయించినట్లు కనుపట్టుచున్నది.

## సిద్ధ మల్లప్ప శాసనము.

919 గు

"శ్రీశైల గర్భమందున త్రికోటీశ్వరస్వామి పాదపద్మా ...ధకుడైన భక్తుడు.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ...౭౨ * అగు నేటి క్షయనామ సంవత్సర కా॥ బ ౧౩ .........ల్లప్ప † తన తల్లితండ్రికి కైలాస నివాసులై

---

* ...౭౭ క్షయ సం॥ప సరిపోవును గనుక ౧౭౭౨ తప్పని తోచుచున్నది.

† ...ప్ప అనుటకు పై యక్షరములు శిలమీద జెడగొట్టబడినని మద్రాసు లై...బ్రరీలోని ప్రతిలో సిద్ధ మల్లప్ప అనికలదు.

నట్టుగాను వంశాభివృద్ధిగాను పడమటి త్రికోటీశ్వర మండపా న్కు దక్షిణద్వారం । హొట్కుమగు ద్వారభద్రము హొట్కు మని జనులుపొగడ ఆచంద్రార్కణం । హొట్కురంమ్య కుధరము హొట్కుమగు.....................................
మాగులూరు వీరభద్రుడు జేశెనూ । గర్భగృహా అంతరాళం దస్తూరి—"

ఈ నూతన కోటీశ్వరుని గుడికి దక్షిణమున గణనా థుని గుడియు పశ్చిమమున సాలంకేశ్వరుని గుడియు ఉత్తర మున అరుగుమీద సంతానకోటీశ్వర లింగమును గలవు. సం తానార్థులీ లింగమును బూజింతురు.

నూతనకోటీశ్వరున కెడమవైపున దొనయొద్ద బిల్వము క్రింద మార్కండేయ పూజితమని చెప్పబడు మార్కండేయ లింగమును తూర్పున మండపమందు నందీశ్వరుడును నందికి తూర్పున దిగువ సోపానమార్గము ప్రక్కన రామలింగేశ్వరుడు (అడివి రామలింగము)ను యీనకు దక్షిణమున సోపానమా ర్గమున గొల్లభామ గుడియుఁ గలవు. కోటీశ్వరుని దక్షిణ మున త్రిమూర్త్యాకారలింగములవలె మూడు లింగములుకలవు ఈమూడు కలిసి మహాలింగమయ్యెను.

కోటీశ్వరునకు వెనుక నొక లింగమూర్తియును తూ ర్పున దుర్గా భైరవులును గర్భగుడియందు ద్వారపాలకులును గలవు.



నూతన కోటీశ్వరాలయ దృశ్యము.

మఱియు నిచటగల గుహాలయందును బిలములందును అనేక లింగములు కలవు. అవియెల్ల ఋషిపూజితములు. వీని మహిమ వర్ణనాతీతము.

## పాపవినాశన స్వామి.

విష్ణుశిఖరము—(గద్దలబోడు) దీనిసమీపమున పాపవినాశనస్వామి గుడి కలదు. దీనిమహిమ స్థలపురాణభాగమున జూడనగును. దీని పూర్వోత్తరము తెలియదు కాని యిటీవల శ్రీ నరసింగయ్య (కోటీశ్వర స్థలపురాణము గ్రంథకర్త) గారిశిష్యులలో నొకరగు పస్సుమర్తి బాలగురువుగారు (నరసరావుపేట వైశ్యుడు) 1866 క్షయ సం॥న మృతినొందిన తన తాత గురువయ్యగారివలన దాను వినిన సంగతులని నాకు జెప్పిన విషయముల నిందు వ్రాయుచున్నాను. శ్రీ నరసింగయ్యగారీ స్థలముపై మిగుల భక్తిశ్రద్ధలుకలిగియుండి రమారమి 70 సం॥ల క్రిందట కొందఱు శిష్యులు 30 మంది పనివాండ్రతో కొండపై నివసించియుండి కోనేల దురస్తు చేయించిరట.

పాత్రికోటీశ్వరుని గుడికడ నొక పానవట్టముండ దాని నొక కరణికు తగిల్చి పాపవినాశనస్వామి గుడికి తేదలచి యత్నించుచుండ నొక యాత్రికునివలె రెడ్డియొకడువచ్చి తానొకవైపును తక్కినవారొకవైపును పట్టిరి కాని రెడ్డివైపు మాత్రమే పైకి లేచెను. పిదపం జేతగాక విడిచి వెళ్లిరి. రెడ్డియు నదృశ్యుడయ్యెను. వీరందఱును నిత్యమువలెనే నూత్న

కోటీశ్వరుని గుడికివచ్చి పరుండిరి. నాటి నిశీధివేళ నరసింగయ్యగారొంటరిగా కోవెల వెలపలికివచ్చి ఆతిచాటునుండి యెవరితోనో రహస్యముగ మాట్లాడుచుండిరి. పబ్బతి గురువయ్య అను శిష్యుడీధ్వనిని విని మెల్లనవచ్చి కనిపెట్టి ఆతిచాటుమనుష్యుని గానక తిరిగివచ్చి పరుండెను. పిదప నరసింగయ్యగారి నీవిషయమడుగగా యిది దేవరహస్యము పానవట్టము గుడియొద్దకుం జేర్చితినని యొక దివ్యపురుషుడు చెప్పెనని యనిరట. మరునాడెల్లఱును పాపవినాశనస్వామి గుడికేగి పానవట్టమును స్థాపించిరట. ఈమరమ్మతులు చేయుకాలమున గురువయ్యపాలెమునుండి శాఖమూరి హనుమంతుగారు అను గ్రామాధికారి కొండపైకి అన్నపానాదులు నడిపించెనట.

పిదప నీ దేవాలయమును 1904 సం॥ తిరుమలరాజు అను నొక యోగి తిరిగి మరమ్మతు చేయించెను. ఇాకులకు క్రీ॥ శే॥ బ్ర॥ కలువకొలను ఉమామహేశ్వరశాస్త్రులు పాటిబండ్ల అమరయ్యగార్లు మిక్కిలి శ్రద్ధవహించి యోగికి సహాయులుగానుండి పనులు నెరవేర్చిరట.

బొచ్చు కోటీశ్వరుడు—మధ్య సోపానమార్గమున మొదట కోటీశ్వరుని గుడి కలదు. దీని నిర్మాణమును తెలియరాదు. ఇచట మ్రొక్కుబడు లుండువారు కేశఖండనము చేయించుకొందురు. అందువలన నీవిధముగ బేర్కొనబడినది. ఇది అష్టదిగ్బంధనలలో తూర్పుదిశ స్థలము. ఇందొక పూర్వశాసనము గలదు కాని శిథిలమైయుండుట తెలియకున్నది.



పాపవినాశనస్వామి కోవెల పార్శ్వము

ఎల్లమంద సోపానమార్గము (ఒంటెలెక్కునది) మధ్యను "గుంటిమల్లయ్య" అను లింగము కలదు. హనుమంతునిల్గొద్ది. ఇచట హనుమంతుని శిథిల విగ్రహము కలదు. ఇది నైఋతి దిగ్బంధన స్థలము.

కీ॥ శే॥ శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వాములవారు (వీరిది పూర్వాశ్రమమున నర్సరావుపేట తా॥ వింజనంపాడు) కీలక సం॥ మాఘ బ ౧౮ (1909 ఫిబ్రవరి 18 తేది) న నూతన కోటీశ్వరునకు నైఋతిని వారదివరకు కాశినుండి తెచ్చిన లింగమును బ్రతిష్ఠించిరి. నాటి మధ్యాహ్నము 12 గం॥ ప్రజలలో కలతపడి దోపిడులు హత్యలు పాకాలు డేరాలు కాల్పులు దుకాణముల లూటీలు మొదలగు దుండగములు (రైటింగు) జరిగి దొరతనము వారిచే విచారణకాబడి నేరస్థులు శిక్షింపబడిరి.

అప్పుడు కోటీశ్వరుని కొండవద్ద డ్యూటిపైనుండిన ప్రభుత్వోద్యోగులు మే॥ పి॥ కెర్ పాస్పుదొరగారు (నర్సరావుపేట డి॥ సబు కలెక్టర్) మ॥రా॥ సూరతు బ్రహ్మానందం నాయుడు గారు (నర్సరావుపేట తహశ్శీలుదార్) మ॥ గోళ్లమూడి సుబ్బారాయుడు పంతులుగారు (స్టేషనరి సబుమేజస్ట్రీటు) మ॥ ఆరణి సుబ్బారావు పంతులుగారు (జిల్లా పోలీసుసూపరెంటెండెంటు) ఇంక ననేకులు కలరు. ఆకలహములో పోలీసు కనిస్టేబిల్ శేషయ్య నాయుడు అనుసతనిని గొట్టి చెత్త వేసి కాల్చిరి. ఈ కలహము పగలు 12 గం॥ మొదలు 3 గంటలవరకు జరిగెను.

అప్పటికొక్కరైన లేకుండ బండ్లు ప్రభలు యాత్రికులు కీలాభీలమై అతిశ్రమమిూద స్థలమువిడిచిపోయిరి.

## కొండదిగువ ఆలయములు.

ప్రసన్న కోటీశ్వరుడు—కీ॥ శే॥ బ్ర॥ గుడిపల్లి అయ్యంభొట్లు గారు (గోవిందపురం) శంభులింగమ్మ చెఱువుకట్టక్రింద నాలు గుద్వారములతో నొక గుడి కట్టించి శా॥ శ॥ ౧౮౪౫ రుధిరోద్గారి సం॥ మాఘ బ ౧౦ లు శుక్రవారమున (1924 సం॥ ఫిబ్రవరి 29 తేది) శ్రీ ప్రసన్నకోటీశ్వరస్వామివారిని శా॥ శ॥ ౧౮౪౭ క్రోధనసం॥ శ్రావణ బ ౮ లున (1925 అగస్టు 12వ తేది) శ్రీ భువనేశ్వరి అమ్మవారిని శ్రీ వేంకటేశ్వరస్వామిని ప్రతిష్ఠించిరి. ఈఅమ్మవారికి ఈశ్వర సం॥ ఆశ్వయుజ శు ౫ శనివారమున నొకరు ధ్వజప్రతిష్ఠ చేసిరి. (చూ॥ ధ్వజముపై శాసనము*) శా॥ శ॥ ౧౮౪౯ ప్రభవ సం॥ ఆశ్వయుజ శు ౧౦ గురువారము (1927 అక్టోబరు 6 తేదిని) శ్రీ అమ్మవారివద్ద బ్ర॥ చింతల చెర్వు కోటీశ్వరరావుపంతులు (ప్లీడరు నరసరావుపేట) గారి యాజమాన్యమున బ్ర॥ భారతులనరసింహాశాస్త్రులవారిచే (కురిచేటివద్ద మాచ్చేడ్డివారిపల్లె) శ్రీచక్రద్వయ ప్రతిష్ఠ చేయబడినది.

---

ధ్వజముపై శాసనము.

* శ్రీ శుభమస్తు— శ్రీ భువనేశ్వరీ అమ్మవారికి బందరు కాపురస్తులు జల్లు బాపన్న గారి కుమారుడు వెంకటసుబ్బారావు యీ ధ్వజమును ఇత్తడి తొడుపుతోసహా పూర్తి చేయించి సమర్పించినాను. ఈశ్వరనామ సం॥ ఆశ్వయుజ శుద్ధ పంచమి శనివారము 9 అక్టోబరు 1937 స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం శ్రీ శ్రీ శ్రీ.

దాది ప్రతి సం॥ శరన్నవరాత్రములందు శ్రీ పంతులవారి
రాజమాన్యమున యీశాస్త్రిలవారిచే కలశస్థాపన జపాదులు
దేవీపూజలు అన్నదానములు జరుపబడుచున్నవి.

శ్రీ తూబాటి వేంకటసుబ్బయ్యగారు. (నర్సరావుపేట
గ్రా॥ తూబాడు) అమ్మవారికి వారి గ్రామమున య 3-0 ల
మరకభూమిని 1936 సం॥ ధాత సం॥ శరన్నవరాత్రములందు
సమర్పించిరి.

అయ్యంభొట్లుగారి యితర ధర్మములు

(1) అయ్యంభొట్లుగారు గోవిందపురమున వాగుదరి
తోట వేయించి శ్రీ వీరాంజనేయ స్వామివారిని నల సం॥
మాఘమాసమున (1917 జనవరి)న బ్రతిష్ఠించి నైవేద్యాదులు
జరిగింపుచున్నారు.

(2) 1900సం॥ వికారిసం॥న కోమటినేనివారిపాలెము
చెంత నొక చేదుడుబావిని త్రవ్వించిరి. ఇది యిప్పటికి చాలా
జనోపయోగముగనున్నది.

నీలకంఠేశ్వరస్వామి — బెజవాడ వైశ్యులు శ్రీయుత
అప్పన వేంకటకృష్ణయ్యగారిభార్య రామమ్మ వీరి కుమారుడు
మహా సదాశివ సూర్యనారాయణమూర్తిగార్లు ప్రసన్న కోటీ
శ్వరుని గుడిప్రక్కన బావి తీయించి దానిలో గుడి కట్టించి
శా॥ శ॥ ౧౮౫౦ విభవ సం॥ మాఘ బ ౧౧ గురువారము
మీనలగ్నా ఘ 7-54 (1929సం॥ మార్చి 7 ఉదయం 10గం॥)
నకు శ్రీ నీలకంఠేశ్వర, లక్ష్మీనారాయణ స్వాములను ప్రసన్న

కోటీశ్వరునకెదుట ఆంజనేయస్వామి నవగ్రహ మూర్తులు నాగేంద్రుని ప్రతిష్ఠించి నిత్య నైవేద్య దీపారాధనలకుగాను ౨౦౦౦ రెండువేల రూప్యములకు గోవిందపురమున యకరం-0లు అయిదు యకరముల మెరక భూమినికొని సమర్పించిరి. ఇదిగాక ప్రతి సం॥ శివరాత్రికి నీలకంఠేశ్వరస్వామికి కళ్యాణోత్సము మిగుల శ్రద్ధా భక్తులతో జరిగింపుచున్నారు.

శ్రీ ప్రసన్న కోటీశ్వరుని కేర్పర్చిన భూవసతులు.

| గ్రామము. | భూ పరిమితి య. శెంట్లు | సమర్పించిన భక్తులు |
|---|---|---|
| గురిజేపల్లి అగ్ర॥ | 6— 0 మెరక బంధకవి వియ్యన్న పంతులుగారు రు 1200 లకు కొని యిచ్చిరి. (నర్సాపురం) | |
| సంతమాగులూరు | 1—50 పల్లం | ఆగ్రామ పెద్దాల్లభక్తులు |
| యెడవల్లి | 3— 0 మెరక | డిటో |
| ఎల్లమంద శి॥ కట్లు బడిపాలెం | 3— 0 ,, | అయ్యంభొట్లు గారి సొంతం |
| గోవిందపురము | 3— 0 ,, | డిటో |
| డిటో | 1—75 ,, | ఆగ్రామ పెద్దాల్లభక్తులు |
| నర్సరావుపేట తా॥ | | |
| వంకాయలపాడు | 0—30 పల్లం | ఆగ్రామ పెద్దాల్లభక్తులు |
| కమ్మవారిపాలెం | 0—50 మెరక | కిలారు నరసయ్యగారిభార్య నారమ్మగారు (కమ్మవారిపాలెం) తొలియేకాదశినాడు స్వామి అభిషేకము భక్తులకు ఫలహారమునకు సమర్పించిరి. |

భువనేశ్వరి అమ్మవారి ప్రహరీద్వారము ఆర్చివిూది శాసనము.
1934॥ శ్రీ భావ సం॥
శ్రీ నీలకంఠేశ్వర సహిత భువనేశ్వరీ అమ్మవారి ఆలయము.
ఈ సింహద్వారముగది మండవ శ్రీరాములు కుమాళ్లు
రామకృష్ణయ్య సుబ్రహ్మణ్యం గార్ల ధర్మం"
నరసరావుపేట.
ఇనపగేటుమీద గలది:- మండవ రామకృష్ణయ్య ధర్మం.
నరసరావుపేట.

## పదిదేవస్థళములు.

ఇవి యిట్లుండ ఎండోమెంటు బోర్డువారు పరిష్కరించిన నెం 2007/16 – 8—1934 రు ఆర్డరు నెం 1 రు షెడ్యూలున దిగువ క్షేత్రములను కనుపర్చిరి.

1. గొల్లభామ, 2 బొచ్చుకోటీశ్వరస్వామి, 3 సాలంకేశ్వరస్వామి, 4 నాగమ్మ, 5 పుట్ట, 6 వినాయకస్వామి, 7 అడవిరామలింగస్వామి, 8 పాతకోటీశ్వరస్వామి, 9 స్తంభాలు, 10 పాపవినాశన స్వామి. వీనిలో సులభముగా తెలియని వాని గుర్తులిక్రింద వ్రాయుచున్నాను: *

* 3 నూత్న కోటీశ్వరుని గుడి వెనుక గుడిలోని లింగము.
4 సాలంకేశ్వరుని గుడి దక్షిణపు ప్రక్కన ప్రస్తుతం శిథిలవిగ్రహము.
5 కోటీశ్వరుని గుడి పైభాగమున దొనలయొద్ద గలది.
6 కోటీశ్వరుని గుడి గోడలోనిది.
7 గొల్లభామ గుడికి పైభాగమున సోపానముల కుత్తరదిశ గలది.
9 కొండ దిగువ రాతిస్తంభము ప్రక్కను గలది. (మాలవాని స్తంభము మాదిగవాని స్తంభము.)

కొండ క్రింద నందిపాటి పాటిమీఁద నొకశిథిల శివాలయ ముండినట్లు దిబ్బలును శిథిలమగు నందియును గనుపట్టుచున్నవి. దీని సంగతులు తెలియవు.

## శిలా స్తంభ ప్రతిష్ఠ

బొచ్చు కోటీశ్వరుని గుడి వెనుక శివపీఠిగ శ్రీయుత రాయుడి సాంబయ్యగారు (తొండపి) గొప్ప శిలా స్తంభమును స్థాపించిరి. దానిపైని యీఁదిగువ శాసనము గలదు.

"గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా తొండపి గ్రామ కాపురస్థులు రాయుడివారు

స్వస్తిశ్రీ ధ్వజప్రతిష్ఠాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు 1840 శకంవర్తమాన వ్యవహారిక చాంద్రమానేన ప్రభవాది షష్టివత్సరాణాం మధ్యే కాళయుక్తినామసంవత్సరే వసంత ఋతువు చైత్రమాసే కృష్ణపక్షే సప్తమ్యాం భార్గవ వాసర యుక్తం వృషభలగ్నే రహితః॥ మద్భక్తులు"

## ఆరవ ప్రకరణము:

### బసవమందిరములు, మఠములు.

కుంకలగుంట కోటయ్యగారు (నరసరావుపేట) కొంత కాలము తాటియాకుల పందిళ్ళ క్రింద శివరాత్ర్యుత్సవ దినములలో బసవమందిరమును నెలకొలిపి అన్నప్రదానము చేయుచు వచ్చి పిదప స్థిరముగ నాలయమును నిర్మించి దేవప్రతిష్ఠలు చేయించి అన్నప్రదానము చేయుచున్నారు.

ఆవిషయ మీదిగువ శాసనముల వలన తెలియును.

Dt. G. 17-2-1923. Oum 5-2-1923
R. D. O.

May God bless our Collector T. G. Rutherford Esq. Guntur and members of the Taluk-Board Narasaraopet for having granted this site to Kunkalagunta Kotayya Dharmakartha of SREE BASAVESWARA SWAMY'S mandir for accomodation to feed the poor pilgrims during Kotappakonda festival.

“క్రోధననామ సంవత్సర కార్తిక బ ౧౧ గురువారం 1925 సం॥ నవంబరు 12వ తేది పగలు 10 గంటల 15 నిమిషములకు ధనుర్లగ్న ఉత్తరా నక్షత్రమున శ్రీ బసవేశ్వర గంగ

మాంబా సంగమేశ్వర కాశీవిశ్వేశ్వర విఘ్నేశ్వరుడు నందీశ్వరుడు ద్వారపాలక ప్రతిష్టలు జరుపబడినవి.

శ్రీ కుంకలగుంట వీరయ్య పౌత్రస్య సంగయ్య పుత్రస్య వీరయ్య జ్యేష్టస్య కోటయ్య ధర్మకర్త. నర్సారావుపేట కట్టించినది, 6—3—1923."

దీనికి తూర్పున మఱియొక బసవ మందిరము శ్రీయుత బెల్లంకొండ కోటినాగయ్యగారు కట్టించిరి. అందలి శాసనము లిందు వ్రాయుచున్నాను.

గర్భాలయ ద్వారబంధము ఉత్తరాశి శిలపై శ్లోకము "యేభూమిపాస్సతత ముజ్వల ధర్మచిత్తాః మద్వంశజాః పరమ హీంపతివంశజావా మద్ధర్మమేవ సతతం పరిపాలయంతి తత్పాదకద్వయమహం శిరసావహామి.

1. శ్రీ బెల్లంకొండ కోటయ్య పౌత్రస్య పిచ్చయ్య పుత్రస్య యెల్లమందయ్య జ్యేష్టస్య కోటినాగయ్య జననం చిరుమామిళ్ల నివాసం యడవల్లిశివాను కట్టుబడిపాలెం. శ్రీఆలపర్తి వెంకయ్య చౌదరిగారి కొమార్తెయు శ్రీ పాములపాటి అంజయ్యచౌదరిగారి ధర్మపత్నియు శ్రీ పరమహంస నిత్యానంద రాజయోగి బెల్లంకొండ నాగార్యులు ఆత్మపుత్రియు శ్రీపాములపాటి అమ్మెన్నమ్మగారు ధర్మకర్తలు. బాపట్ల తాలూకా నిడుబ్రోలు.

2. పంచలో తూర్పుగోడమీఁదిది.
"శ్రీ ఆలపర్తి వెంకయ్య చౌదరిగారి ధర్మపత్ని యగు ఆలపర్తి వెంకాయమ్మగారి ధర్మము. బాపట్ల తాలూకా నిడుబ్రోలు."

3. పంచపశ్చిమీఁదిది.
"1935 సం॥ శ్రీ నిత్యానంద రాజయోగి బెల్లంకొండ కోటినాగార్యులవారి భక్తసమాజమందిరము. శ్రీ యువనామ సం॥ శ్రీ ఆలపర్తి వెంకయ్య చౌదరిగారి కొమార్తె అమ్మమ్మగారి ధర్మము. నిడుబ్రోలు"

నాగుబడివారి మఠము.

1876 సం॥ ధాత సం॥కు పూర్వమే అయ్యంభొట్లుగారి సత్రము వెనుకనుండు మఠము నిర్మింపఁబడినట్లు తెలియుచున్నది. దీని సవిస్తారమిట్లున్నది *. ప్రథమమున నొక విశ్వబ్రాహ్మణుడు కట్టుబడిపాలెము రైతులవలన కొంతస్థలము సంపాదించి గోడలు పెట్టించి మఠమును కట్టించుటకు కలపకై మన్యమునకుబోయి యచటనే గతించెను. ధాత సం॥కు పూర్వమే నాగుబడి వెంకయ్యగారు (వంగోలు తా॥ బ్రాహ్మణవిడమానూరు కమ్మవారు) కోటీశ్వరుని కొండకువచ్చి యీ మఠములోనే ౨౦ సం॥లుండి వారి తల్లి అక్కమ్మగారి నిందే

* శ్రీ చింతలచెరువు కోటీశ్వరరావు పంతులు గారిచ్చిన సంగతులిందు వ్రాయఁబడినవి.

సమాధిచేసెను. ఈయన దస్తగిరి మహమ్మద్ నాగూరి మీరాసాహేబు గుంటూరు నల్లమస్తానయ్యగార్లకు శిష్యుడై యుండి రమారమి 40 సం॥ల క్రిందట యిచటనే సమాధి అయ్యెను. ఈయన సమాధియగునాటికి యీయన మేనల్లుడు వెంకటాద్రియును పినతల్లి కుమారుడు వడ్డవల్లి కృష్ణయ్యయు నిచటనేయుండి కొంతకాలమున కిచటనే సమాధినొందిరి. వెంకయ్యగారు సమాధినొంది యుండగా చూడవచ్చిన పిఠాపురము కాపురస్తులు పీరు సాహెబుగారను భక్తుడును యిచటనే సమాధియయ్యెను.

మున్నంగి సుబ్బమ్మగారు (మున్నంగివారిపాలెం రెడ్లు). కొంతకాలమిచట పూజలు జరుపుచుండెను. ఈకాలముననే నాగుబడి వెంకయ్యగారి కు॥ రామకృష్ణయ్యగారును నిచట సమాధి అయ్యెను.

చెన్నబోయిన కోటిలింగము (వినుకొండ తా॥ మృత్యుజాపురంగొల్ల) యిచటికివచ్చి పూజలుచేసి వెళ్ళుచుండెడివారు.

మున్నంగి సుబ్బమ్మ యిచటనుండు కాలమున మేకల వెంకమ్మ (చిరుమామిళ్ల రెడ్లు) 1910 సం॥ ప్రాంతమున నిచటికివచ్చి సేవించుచుండెను. అటుపిమ్మట 3 సం॥లకు సుబ్బమ్మయు నిచటనే సమాధిఅయ్యెను. 1910 సం॥ నాటికి రెండు పూరిండ్లు మాత్రముండెను. మేకల వెంకమ్మ చేరినపిమ్మటనే ప్రహరిగోడలు నిద్దిబావు లేర్పడెను. కోటిలింగమను నతడిచటయుండి యిటీవల 1936 సం॥ గతించి సమాధి అయ్యెను.

## ఏడవ ప్రకరణము.

### పురాతన శాసనములు.

ఈస్థలము రమారమి 800 సం॥ లకు బూర్వమునాటి
కైనట్లు తెలుపు కొన్ని శాసనములీ కోటెలయందు గలవు.
దక్షిణ ఇండియా శాసనములు వాల్యూం 4న 915 మొ॥ 925 ల
వరకు ముద్రింపబడినవి. అవి అసమగ్రముగను తప్పులతోను
గాతిపై నుండుటచే నట్లే ముద్రించిరి. వానిని దిగువ వ్రాయు
చున్నాను.

నెం 915 దు (ఇందలి సంఖ్య పంక్తులని తెలియ నలయును.)

1. ... ... ... ...
2 వెలనాంటి చోడ ...
3 భీమనాథాయనర్త్రాయః
4 విక్రమా... సంగతే
5 జాన...తత్వ...సా
6 ... ... ... ...
7 భూవిక్రమక్రమ...
8 మహాబలాధికా త్పతంతిభయ
9 ...త్వం...
10 భూః నూంకాండి ... త్రిపురం
11 ... యనాత్మనే

12 ... ... ... ...
13 ... ... ... ...
14 ... రనీసశ్యవర్ధన నివారిత
15 to 19 పోయినవి.
20 ... మహేశ్వరపదాంబుజభక్తిని
21 ... శకాబ్దంబులు
22 ... వాప్తకరంబు (వర) ...
23 ... అఖండ దీపరత్నంబునుంచె వారా ...
24 ... రమైపరగంగాను ... స్వస్తి శక
25 ... లు ౧౦౯౮ నేంటి చైత్ర కృష్ణ త్రయో
26 ... వారమున విషువ సంక్రాంతి నిమిత్తం
27 ... మహామండలేశ్వర వెలనాంటికుల్తోత్తుంగ
28 ... య రాజులకు నిష్టభ్రుత్యుండును జతు
29 ... అర్ధ...సుధాకరుండును బలు
30 ... వేశ్వరుండును (కుణ) మాంగల్య గోతు)
31 లైన యూరాండ్డినాయకుండు
32 ... తల్లిదండ్రులకు ధర్మార్ధంగాంగ
33 ... టిలోని కావూరి కోటీశ్వర మహా
34 ... నఖండవృత్తిగ దీపంబునకుంబెట్టి
35 ... లు ౫౫ వీనింజేకొని

( మిగతా భాగం కట్టుబడిలో పోయినది. )

నెం 916 రు

1 ... ... ... ...
2 ... ... ... ...

3 ... త్తుంగరాజేంద్రచోడయూ రా
4 జునకు ధర్మవ్రుగాను ...త్రి...
5 ... శాసనుంబైన కాశ్యపగో...
6 ... పకునర్ణ తమతల్లిం
7 ... కామాంబకు ధమర్ణవుగాను
8 ... కొప్రాంరి త్రికోటీశ్వర శ్రీమహా
9 దేవరకు నఖండదీపంబున
10 ... కుం బెట్టిన గొఱ్ఱియాలు ౨౨ ...
11 ... ఏనిం చేకొని మైందని (సోమ)
12 ... లిక జక్కబోయిని కొ
13 డుక్క కేతనబోయుంను తన
14 .....................కమాచంద్రార్కము
15 .....................(మిగతా భాగము లేదు)

నె 917 (గర్భాలయ దక్షిణ ద్వారశాఖయందు)

1 ఓమ్ — శ్రీ వల్లభస్య విబుధాధిప వల్లభస్య
2 నారాయణస్య జగదేక పరాయణస్య నాభ్య
3 ంబుజాదుద భవద్భగవాన్విరించిస్తత్పా.........
4 దత్తో జని చతుర్థ జనాన్వవాయః [౧] అస్మి
5 న్బభ్రాజరాజ ద్రజని కరకర క్షీర నీ హార
6 హార శ్వేతోద్గతోరు కీర్తి త్రిభువన వినుతో...
7 గణ్య సాద్గుణ్య పణ్యః — శ్రీ మాన్భీమాభిధా
8 నోన్నృపతి రతి మహాన్ ధార్మికానా ముదగ్రస్త

9 స్య శ్రీ బింబమాంబా సురుచిర చరితార్థమర్మ...
10 [ప]త్నీ బభూవ [౨] గండక్షితిపతి స్సాభ్యా......
11 మీాభ్యస్సుభ్యా విభూషణః [1] సుధీస్యమ ......
12 [భ] వద్రాజ ద్రాజధర్మ విచక్షణః । [3] శచీ
13 వశక్రస్య సరస్వతీవ స్వయంభువ [ః] శ్రీ........
14 రివశాజ్ఞ పాణిః [।] శివేవ సర్వ్వస్సమహిమ్య...
15 ముష్య శ్రీ విజమాంబానిత రాంవ్యరాజ ....
16 [త] దస్త్రా త్ప్రజానామివదివసపతి ద్దే .....

(మిగతా భాగము పోయినది)

శా 918 (గర్భాలయ దక్షిణద్వార శాఖ యందు)

1 స్వస్తి సమధిగత పంచ మహాశబ్ద [మ]
2 మహా మండలేశ్వర ప్రతాప లంకేశ్వర చాలు
3 క్య రాజ్య భవన మూలస్తంభ శుంభ జ్జృంభి
4 తరిపు మదస్తంభ చతుర్థ కులవనజ వ
5 న మార్తాండ చలమర్తి గండ చతుశ్శతా శీ
6 తి గ్రామావనీవల్లభసహకార వల్లభ
7 ఆహావరక్షన ప్రక్రమ కర్కశ భండన భీమ
8 భువనాభిరామ దాయ గజసింహ సాహ
9 సోత్తుంగ నామాది సమస్త ప్రశస్త సహితం
10 శ్రీ మన్మహా మండలేశ్వర వెలనాంటి రాజేంద్ర
11 (చో) డ రాయని మనోనయనవల్లభియైన స్వా
12 (ంభు) దేవులు కొండపడమటి కావూరి

13 ... ...త్రికోటి
14 సఖండవర్తి దీపంబునకిచ్చిన గొఱియలు ౫౫
15 వీనిం గొన్న బ్రాంరిమహాజనమునసానులోం(ప్పం)గు
16 (న్న)బోయ కొడుకు ముచె సేకొని నిత్యమానెం
17 డు నెయిగా నాచంద్రార్కస్థాయముం బుత్రపౌత్రిక ము దీపంబు
18 నకు బోయంగలవాండు (1) దీనికి విఘ్నము సేసినవా
19 (ండు) మహాపాతకుండగు॥

నె 919 రు మూ 5 ప్రకరణము,

నె 920 రు

1 ౽ స్వస్తి (1) శకవర్షములు ౧౦౫౮ అ
2 గు మాఘ బహుల ౧౪ నాండు
3 త్రికోటీశ్వర దేవరకు అఖండ వ
4 ర్తి దీపము ప్రమాన బిడ్డబిడ్డ తర
5 మున నిత్యమానెండు (నేయి) బోయ
6 ంగలవాండు దీపమునకుం బెట్టి
7 నత్యాగిగద్యలు ౽ దీనికి విఘ్నము
8 సేసినవాండు మహాపాత
9 కము శేసినవాండు (శ్రీ)

నె 921 రు మొ॥ 925 కేవలము తెలియక నిరుపయోగముగ నున్నందున విడువబడినవి.

1924 వ సంవత్సరం సెప్టెంబరు 29వ తేది ఆంధ్రపత్రికయందొకరు మద్రాసు ఓరియంటల్ లయిబ్రరినుండి తాను సంగ్రహించిన శాసనములని ప్రకటించిరి. వీనియందు 1060, 1065, 1091 సంవత్సరములవనియు నన్నిటిలోను య 165 ల భూమి యిచ్చినట్లును వ్రాసిరి. ఇది అసంగతముగా నుండుటచే వాని నిందు విడిచితిని.

## యంత్ర స్థాపన శాసనము.

ఈక్షేత్రము పురాతనమైనట్లు పైశాసనముల వలన గను బట్టుచున్నను మిగుల బ్రశస్తిగా నుండకుండుటచే గాబోలు ప్రభువుల ఆజ్ఞానుసారముగ నరసరావుపేట తా॥ ఏల్చూరు వాస్తవ్యులు బ్ర॥ పినపాటి ఏలేశ్వర అయ్యవార్లంగారిచే నొక జనాకర్షణ యంత్రము స్థాపన చేయబడినట్లు కీ॥ శే॥ బ్ర॥ పినపాటి సాంబయ్యగారియొద్ద యీాదిగువశాసనమువలన దెలియుచున్నది. ఈయంత్రమును గురువయ్యపాలెము సమీాపమున పొలిమేరగుంటక్రింద స్థాపించి దీని రక్షణార్థమై దుర్గా భైరవుల నిలిపిరనియు కీ॥ శే॥ శాఖమూరి హనుమంతుగారను (గ్రామాధికారి) 60—70 సం॥ ల క్రిందట దానిని కదలింప యత్నించి ఆపదలనొంది రక్తము గ్రక్కుకొనిరని యొక ప్రతీతి గలదు.

## శాసనము.

"శ్రీరామ

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షం

ు ౧౬౮౧ అగునేటి ప్రమాది నామ సంవత్సర మాఘ
౧౫ లు యజుశ్శాఖాధ్యయులున్ను, ఆపస్తంబ సూత్రు
న్ను, భారద్వాజస గోత్రులున్ను వీరభద్రప్ప అయ్య
ంగారి పౌత్రులున్ను శివన్న అయ్యవార్లంగారి పుత్రు
న్ను అయిన శ్రీ మద ఘోరాచార్య సింహాసనోద్భట్టా
స్య వైదిక తాంత్రిక మహా శైవ శాంభవీ దీక్ష మంత్రో
ుకులైన యేకలింగ పూజానిష్టారిగష్టులైన పినపాటి యేలే
అయ్యవార్లంగారికి మిర్యాల గోత్రులున్ను కొండల
మునింగారి పౌత్రులున్ను రామారాయనింగారి పుత్రులు
్ను అయిన మల్లాజు గుండారాయనింగారు వ్రాయించి యి
స ధర్మాధికార పూర్వకమైన ధర్మశాసన పత్రికె. మాకు
ముఖి మన్నె కావలి మిరాశికి సాగివచ్చే బెల్లంకొండ సీమ
చేరిన మునిమంద అనే పేరుగల యల్లమంద కొండమీద
పూర్వులవల్ల ప్రతిష్ట చాయబడ్డ శ్రీ త్రికోటీశ్వరస్వామివా
నైవేద్య దీపారాజన అభిషేకప్రయోజనములు పూర్తిగా జర
వక తమరు ఆనగంమీదవుండి ఆహారనియముచేసే తపః
ావల్ల జనాకరషణ యంత్రస్థాపనచాయ నిశ్చయించి అం
ు మావల్లమెపిశక........ రాకుండా ధర్మాధికారం
ముందే వుంచగలందులకు వ్రాయించియిప్పించమని శెలవు
స్తిరి గనుక వ్రాయించియిచ్చిన వయినము—

యీనగంమీదను నిరాహారులయి తపఃశ్చేసి స్థాపన
శే జనాకషణ యంత్రమువల్ల శ్రీశైలాది పుణ్యక్షేత్రము
లెనే ప్రకాశమానములోకివచ్చి అక్కడనుంచి ఆహారాయ

మానులయ్యే సమస్త దేశాదుల జనంవల్లవొచ్చే ద్రివ్యములో స్వామివారి సమస్తవ్రియంజరగగా శేషించిన ద్రివ్యము తమ పుత్రిపౌత్రి పారంపరియం ఆచందార్కస్థాయిగా అనుభవిస్తు సుఖానవుండు కోవలెనని కోరి వ్రాయించి సమర్పించిన ధర్మాధికారపూర్వకమయిన ధర్మశాసనపత్రికె శ్రీ శ్రీ శ్రీ

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతంపదం॥
శ్రీ రామచంద్రాయనమః
గుండారాయని వ్రాలు అని యున్నది. మొహరు వున్నది" *

ఈ ధర్మాధికారము వీరికి నాలుగు సం॥లు మాత్రమే జరిగి పిదప వీయన తమ్మునికుమారుడు శివన్న అయ్యవారి కాలమున చిలకలూరిపేట సివిల్ కోర్టులో జరిగిన వ్యాజ్యమున తిరిగి జమీందారుగారి స్వాధీనమయినట్లు శ్రీసాంబయ్యగారు చెప్పిరి.

అష్టదిగ్బంధనము.

ఈ యంత్రమేకాక యీ స్థలరక్షణార్థమై యీదిగువ రీతిని అష్టదిగ్బంధనము చేసినట్లు చెప్పుచున్నారు. తూర్పు– బొచ్చుకోటయ్య ఆగ్నేయమున– పాపలమ్మ (శంభులింగమ్మ చెరువు బోటియందు గలదట) దక్షిణము–వేములమ్మ (మహిషాసురమర్దని కొండకావూరితోవప్రక్కన గలది) నైఋతి–

* ఇది కాగితపు శాసనము. దీనిని కీ॥ శే॥ బ్ర॥ పినపాటి సాంబయ్యగారు 1911 సం॥న నీ గ్రంథ ప్రథమ ముద్రణకు నాకొసఁగి తిరిగి తీసికొనిరి.

నుమంతుడు (శిథిలము హనుమంతుని లోద్ది). పడమట—
ర్గా భైరవులు భేతాళుడు హనుమంతుడు వాయవ్యము–ము
–డిదేవత (కొండపైన) ఉత్తరము–ఉబ్బు రామలింగస్వామి
గురువయపాలెము వైపుకొండయందు)- ఈశాన్యము—పాపవి
ాశనస్వామి- వీనిలో కొన్ని యదృశ్యములు. పై యంత్రి
ంహిమ శాశ్వతముగ జరగగలందులకు బంగారు యంత్రము
ప్రయించినట్లును మరియు నిధినిక్షేపములు గలవనియు ప్రతీ
గలదు. దీనిని బురస్కరించికొని 1934 సెప్టెంబరు 18 వ
ేది రాత్రి నిశీథివేళ గొందఱ్ స్థలమునకువచ్చి నందిపాటి
ాటిమీద కురనవద్ద నలమూల దావీదు చేనిగట్టున ధనము
యు యత్నించి కొన్ని తంతులుజరిపి త్రవ్వ నారంభించగా
ొండపైనుండి వెలుతురుతో నెవరోవచ్చినట్లు కనుపడి వృద్ధ
స్త్రీ రూపమున శక్తిదర్శనమై మూర్ఛాక్రాంతులై వెడలిపో
యిరనియు పిదప వారిలో నఖండము పట్టిన చాకలి యువకుడు
జ్వరపడి మృతుడయ్యెననియుఁ జెప్పిరి. మరునాడు దావీదు
ేనికిరాగా ౧ కోడి 3 టెంకాయలు నిమ్మబద్దలు పసుపు కుం
ుమ అక్షతలు తనకు కనుపడెనని దావీదు చెప్పెను.

ఈయంత్రము వేసిన ఏలేశ్వర అయ్యవారు ప్రస్తుతపు
ార్కైవవ పురుషుడు. వారి వంశక్రమమీదిగువజూడనగును.

పిసపాటి వారి వంశము.

1. ఏలేశ్వర అయ్యవారు (మంత్రకర్త) 2. లింగయ్య
. భీమలింగము 4 పట్టెసము.

1. నిస్సంతు 3. రావినూతలకు 4. కంభంరావిపాటికిచేరి

2. లింగయ్యకు A ఏకేశ్వరము B శివయ్య

A ఏకేశ్వరమునకు — లింగయ్య, వీరయ్య

లింగయ్యకు-పట్టయ్య వేంకటప్పయ్య వీరభద్రయ్య
పట్టయ్యకు-కాంతయ్య, నరసింహం, లింగయ్య, మహాదేవయ్య.

B శివయ్యకు — పెదవీరయ్య, చినవీరయ్య, బుచ్చివీరయ్య

పెదవీరయ్యకు–పెదసాంబయ్య మహాదేవయ్య
పెదసాంబయ్యకు-వీరన్న అయ్యవారు ప్రస్తుత పురుషుడు.

బుచ్చివీరయ్యకు– వీరభద్రయ్య, సాంబయ్య, శివయ్య, వీరయ్య, మహాదేవయ్య, పట్టయ్య, మృత్యుంజయుడు.

సాంబయ్యకుశివానంద శాస్త్రి. ప్రస్తుతపురుషుడు

## ఎనిమిదవ ప్రకరణము.

## కోటీశ్వరునికి భక్తులర్పించిన భూములు.

ఈస్వామికి శ్రీమంతులగువారు భూములు సమర్పించిరి తెలిసినంతవరకీ క్రిందవ్రాయుచున్నాను.

శ్రీకృష్ణరాయలమంత్రి సాళువ తిమ్మరుసయ్యంగారు కొండకావూరు అగ్రహారమర్పించినట్లు కొండకావూరితోపు లోని శీ సర్వే నె 264 రు ఆంజనేయస్వామివారి యెదుటగల యీాదిగువ శాసనమువలన దెలియుచున్నది.

"శ్రీగురవేనమః

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౧౩ * అగు నేటిబహు ధాన్య సంవత్సర పుష్య బ ౧౪ బుధవారం శ్రీ త్రికోటీశ్వరు నికి క్రిష్ణ దేవ మహా రా య ల ఆననిని ప్రధాని తిమ్మ రుసయ్యంగారు దండాపెట్టి సమప్పింాంచిన గ్రామం 1 కొండ కావూరు దేవునికి అంగరంగవైభవాలకు సమర్పిస్తిమి.

అష్టభోగ తేజస్వామ్యాన ఆచంద్రార్కస్థాయిగాను ఆ గ్రామఫలం అవధరించేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం పరద
త్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

---

* రాతిమీాద శకసంఖ్య ౧౩౧౩ వలె గనుపట్టుచున్నది కాని బహు ధాన్యకు సరియగు శకసంఖ్య ౧౪౪౦.

త్రికోటీశ్వరుని శావకుంభమను రామూరి సోమయ్యా శ్రీ శ్రీరం జేయును."

ఇదికాక మఱికొందఱు భక్తులు యీనామభూముల ర్పించినట్లు చెప్పెదరు. వినికిడినిబట్టి దీని పూర్వభాగమున వ్రాసిన వానినిందు వ్రాయుచున్నాను.

మ॥ రా॥ రా॥ శ్రీ శ్రీరాజా మల్రాజు వేంకటగుండారాయని వారి ధర్మములు.

| | | |
|---|---|---|
| కొండకావూరు | అభిషేకబ్రాహ్మణులకు య. | 102-0 |
| ,, | భజంత్రీలకు | 6-0 |
| ,, | బాణాకార్లకు | 9-0 |
| ,, | కోటీశ్వరస్వామివారికి | 60-0 |
| ,, | గొల్లభామకు | 10-0 |
| ఉప్పలపాడు | స్వామివారికి | 10.0 |
| సోమవరపుపాడు | ,, | 10-0 |
| లింగంగుంట | ,, | 16-0 |

శ్రీ మానూరివారి ధర్మములు.

| | | |
|---|---|---|
| సాతులూరు | ,, | 10-0 |
| చిఱుమామిళ్ల | ,, | 20-0 |
| గోనెపూడి | ,, | 20.0 |
| జొన్నలగడ్డ | ,, | 6-0 |

మ॥ శ్రీరాజా వాశిరెడ్డి వేంకటాద్రినాయనివారి ధర్మములు.

| | | |
|---|---|---|
| తంగెడమల్లి | ,, | య 20-0 |
| బెల్లంకొండ | ,, | 10-0 |
| పెట్లూరువారిపాలెములో శ్రీ గణపతిరావుగారిచ్చినది | | 6-0 |
| ఎల్లమందలో రాయలవారిచ్చినది | | 49-0 |

ఇటీవల ఎండోమెంటుబోర్డువారు వ్యవహరించి 1927సం॥ న 2 రు ఆక్టు 18-63-64 శెక్షనులప్రకారము పరిష్కరించిన O. A. No. 257 of 1933 నెం 2005/16-8-1934 ఆర్డరులో వ్రాయించినస్వామివారిభూములపట్టికనిందు చూపుచున్నాను.

దాతలపేర్లు లేవు.

| పట్టా నె॥ | సర్వే నె॥ | విస్తీర్ణము. య. శెం. | శిస్తు. రు. అ. పై. | వచ్చుబడి. రు. అ. పై |
|---|---|---|---|---|
| | | గొల్లభామకు కొండకావూరిలో | | |
| 419 | 223 | 9—88 | 9—14—0 | 36—0—0 |
| | | త్రికోటీశ్వర స్వామికి—డిటో గ్రామం. | | |
| 801 | 47 | 4—98 | 5—0—0 | 240-0-0 |
| | 167 | 3—75 | 3—12—0 | |
| 421 | 227 | 46—93 | 58—11—0 | |
| | 269 | 4—78 | 6—0—0 | |

డిటో యల్లమంద.

| | | | | |
|---|---|---|---|---|
| 208 | 895 | 46—26 | 86—12—0 | 200—0—0 |
| | 929 | 0—74 | 5—15—0 | 9—0—0 |
| 748 | 73 | 5—90 | 5—14—0 | 60—0—0 |
| | 94 | 6—73 | 6—12—0 | 30—0—0 |

డిటో పాతులూరు.

| | | | | |
|---|---|---|---|---|
| 506 | 651/E | 0—47 | 1—3—0 | 100—0—0 |
| | 531/A | 10—52 | 19—12—0 | |
| | 531/E | 0—15 | 0—5—0 | |

డిటో జొన్నలగడ్డ.

| | | | | |
|---|---|---|---|---|
| 1033 | 339 | 3—02 | 3—12—0 | 30-0-0 |
| | 449 | 0—26 | 0—5—0 | |

డిటో బెల్లంకొండ.

| | | | | |
|---|---|---|---|---|
| 1011 | 67 | 13—34 | 11—11—0 | 20—0—0 |

డిటో ఉప్పుమాగులూరు.

| | | | | |
|---|---|---|---|---|
| 460 | 630 | 8—10 | 10—2—0 | 50—0—0 |

డిటో చిరుమామిళ్ల.

| | | | | |
|---|---|---|---|---|
| 357 | 51 | 10—54 | 19—12—0 | 150 0—0 |

డిటో పెట్లూరివారిపాలెం.

| | | | | |
|---|---|---|---|---|
| 160 | 57 | 12—31 | 12— 5—0 | 70—0—0 |

స్వామివారి నవుకరీ యీనాములు.

భజంత్రీలకు కొండకావ్రాయు.

| | | | | |
|---|---|---|---|---|
| 415 | 219 | 6—58 | 6— 9—0 | 18—0—0 |

అభిషేకపు యీనాము.

| | | | | |
|---|---|---|---|---|
| 417 | 69 | 101—87 | 127— 5—0 | 125—0—0 |

యంత్ర పురశ్చరణ యీనాం.

| | | | | |
|---|---|---|---|---|
| 980 | 234 | 9—06 | 11— 5—0 | 100—0—0 |
| | 235 | 18—20 | 22—12—0 | |

బాణాకార్ల యీనాం.

| | | | | |
|---|---|---|---|---|
| 416 | 270 | 6—38 | 6— 6—0 | 25—0—0 |

## తొమ్మిదవ ప్రకరణము.

### నీటివసతి-చెఱువులు కుంటలు.

రమారమి 6-7 నూర్ల సంవత్సరములక్రిందట వినుకొండ తాలూకా పెదకంచర్ల ప్రభువుగానుండి పల్నాటి వీరులతో బాంధుత్వముచేసిన కృష్ణగంధర్వరాజుచ్ఛట నొక చెరువు వేయించెను. పిమ్మట శంభులింగమ్మ అను జంగమ స్త్రీ వైశ్యరాలయి యొక కుష్ఠురోగికి నయముచేయగా నామె కు వారు మూడు దోసెళ్ల వరహాలు బహుమతిచేయ నాద్రవ్యముతో నిచట యీచెర్వు శిథిలమైయుండ తిరిగిమరమ్మతుచేయించి చెర్వుచెంత నొకతోపును కోనేరును నెలకొల్పెను. చెర్వు యిప్పటికిని యీమెపేరనే వాడబడుచున్నది. తోపు, కోనేరు యిప్పుడ దృశ్యములు. మఱియు నూతన కోటీశ్వరునిగుడికి శిఖరము కట్టించెనని చెప్పుదురు. యీమెకాలము తెలియరాదు. ఈ చెర్వును నూరేండ్లక్రిందట నర్సారావుపేట తాలూకా గోవిందపురంశివారు కోమటినేనివారిపాలెంకాపురస్థుడు కోమటి నేని పర్వతాలుగారు విశాలముచేయించి మంచిస్థితికి తెచ్చిరి. ప్రస్తుతం యండోమెంటు బోర్డువారు మరమ్మతు చేయించుచున్నారు.

2. ప్రాతకోటీశ్వరుని గుడికిబోవుదారిలో నరణ్యమున రేగులకుంట గలదు. దీని కర్తపేరు తెలియదు.

**3.** నూతన కోటీశ్వరునిగుడికిపోవు మధ్య సోపానమార్గమునకు ఉత్తరదిశను కొండపైన సన్యాసివాని కుంట కలదు. దీని కర్త పేరు తెలియదు. కాని 70 సంవత్సరముల క్రిందట పబ్బతి గోపాళుగారు (నర్సారావుపేట) మరమ్మతుచేయించినారని తెలియును.

**4.** నూకేండ్లకుపైన అయితా రామయ్యగారు మధ్య సోపానమార్గమూలమున బొమ్మకోటయ్య గుడివద్ద నొకచెర్వు త్రవ్వించెను. (యిదే మొద్రచెర్వు)

5. కొండకాల్వాను త్రోవను కొన్ని సిథిలమైన మొండికట్టలు కనుపడుచున్నవి వాని వివరము తెలియదు.

**6.** **మా**రెళ్లవానికుంట పాతకోటప్పగుడికి తూర్పున నొక ఫర్లాంగుదూరమున గలదు.

తోపులు

శాఖమూరి పెద్దన్న యీరామన్న గ్రంధి వెంకన్న తంగెడుమల్లి పాపయ్య ముప్పా సూర్యుడు తోపులు వేయించినట్లు తెలియుచున్నది.

స్థలవివరము తెలియదు. పూర్వపు తోపులు శిధిలములయి నిరుపయోగములయినందున దొరతనము వారు రెండు తోపులు వేయించిరి. అందొకటి 1880వ సంవత్సరమున రెండవది 1886 వ సంవత్సరమున.

## కోనేళ్లు.

కొందరు భక్తులు యాత్రికుల యుపయుక్తమునకై కోనేర్లు తీయించిరి యివి క్రమేణా శిథిలము లగుచుండినను యిప్పటికిని యుపయోగింపబడుచున్నవి. వారి పేర్లీ క్రింద వ్రాయుచున్నాను. మొన్నపల్లి అంతయ్య పంతులు, గుంటి పట్టయ్య, కాశినాథుని భగవానులు, బిట్రా కేశవులు, అవ్వారి పెద్దయ్య, యీశాయన్న, జాగర్లమూడి కోటయ్య, కూకుట్లపల్లి శంభుడు, గ్రంథి వెంకయ్య బూసా మల్లయ్య, దొమ్మర బాలేరావు, ధూపం నాగమ్మ జొన్నలగడ్డ పేరడు, గర్నెపూడి నాగడు, సింగం శేషయ్య, పోతుకూచి అప్పయ్య, కుంకలగుంట సంగయ్య, చెన్నుపల్లి కుమ్మరి, కాసుమల్లి అయ్యగాడు మడపజంగాలు, పేర్లు తెలియనివి మఱికొన్ని గలవు.

ఇవిగాక పూర్వమిచ్చట తహశిల్ దారుగానుండిన మ॥ రా॥రా॥ పులుగుండం లక్ష్మీనారాయణప్ప పంతులుగారు తమ తల్లిగారిపేర లేదోపులో నొక కోనేరు తీయించి యీదిగువ శాసనము వేయించిరి.

“శ్రీ వేంకటరమణ - శుభమస్తు. కృ॥ డిస్ట్రిక్టు నర్సారావుపేట తా॥ త॥ గారు పులుగుండం లక్ష్మీనారాయణప్ప పం॥ తల్లి తిమ్మాయమ్మగారు తవ్వించిన బావి। శాలివాహన శకం ౧౭౦౮ వ్యయనామ సం॥ ఇంగ్లీషు ౧౭౮౬ సంవత్సరం

గిలక బావులు.

నీటివసతికై తాలూకాబోర్డువారు 1909 సం॥ గబ్బిట వారి సత్రమువద్ద నొకటి కుంకలగుంటవారి బసవమందిరము వద్దనొకటి పెద్ద గిలకబావులు త్రవ్వించిరి. ఇవిగాక కొందరు భక్తులు మరికొన్ని గిలకబావులును తీయించిరి. వానివివరం లిందు వ్రాయుచున్నాను.

గుడిపల్లివారిసత్రము దొడ్డిలోపల వెలుపలను బావులు తీయించి యీదిగువ శాసనములు వేయించిరి.

సత్రం దొడ్డిలోని బావిమీదిది.

"శ్రీ పావులూరి వెంకయ్యశాస్త్రులున్ను ముద్దన రామయ్యగారి జ్యేష్ఠపుత్రుడు యీ వెంకటేశ్వర్ల జ్యేష్ఠభ్రాతయు అయిన ముద్దన రంగయ్య శ్రీ యల్లమంద కోటీశ్వర స్వామివారి ప్రీత్యర్థం శ్రీ గుడిపల్లి అయ్యంభొట్లుగారి అన్నదానసత్రమందు స్థాపింపబడిన బావి ప్రభవ 1927"

సత్రం వెలపటి బావిమీదిది.

"స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షంబులు ౧౮౪౬ రుధిరోద్గారి నామసంవత్సరములో బెజవాడ వైశ్యకులోద్భవులు శ్రీహరిపాదభక్తులు నిడుముక్కల పిచ్చయ్య మహాలక్ష్మమ్మగారి కుమార్డు సుబ్బారాయుడుగారు సమర్పించిన సప్త సంతానాంతర్గతమైన మంచినీళ్లబావి ధర్మం 1924."

ప్రసన్న కోటీశ్వరుని కెదుటబావి.

“శ్రీమద్ది వెంకటసుబ్బయ్యగారి ధర్మం గుంటూరు”

కొండకావూరితోవలో కాకుమాను జగ్గయ్యగారిబావిమీదిది

“స్వస్తిశ్రీ శాలివాహనశకం ౧౮౪౮ సం॥యగు క్షయ నామసంవత్సర ఫాల్గుణ బ ౯ లు సౌమ్యవాసరం వినుకొండ తాలూకా ముప్పాళ్ల గ్రామవాస్తవ్యులు వైశ్యులు నాభిళ్ల గోత్రోద్భవుండగు కాకుమాను బసవయ్య భార్యయును జగ్గయ్య తల్లియును అయిన రామలక్ష్మమ్మ లోకోపకారార్థం చేయబడిన కూపప్రతిష్ట”

వెఱ్ఱిచెరువు లోనిది.

“ కాకుమాను హనుమయ్య వరప్ప శాంతయ్యగారు (ముప్పాళ్ల) త్రవ్వించినది.”

“స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షంబులు ౧౮౫౦ కలియుగాది సం॥ ౫౦౨౯ అగు విభవనామసం॥ పుష్య బ౧౩లు సరియగు ౧౯౨౯ సం॥ దివి ౭వ ఫిబ్రవరి తారీఖున నాబెళ్ల గోత్రోద్భవుండున్నూ కాకుమాను రంగయ్య పౌత్రుడున్నూ బసవయ్య పుత్రుడున్నూ అగు హనుమయ్య శ్రీ కోటీశ్వరస్వామివారికి సమర్పించిన ధర్మం.”

దీనికి సమీపమున గోవిందపురం కా॥ విశ్వబ్రాహ్మణులు వడ్లపాటి బ్రహ్మయ్యగారొక బావి త్రవ్వించిరి.

కొండక్రింద మధ్య సోపానమార్గమూలమున విశ్వబ్రాహ్మణుల సత్రంలోని బావి.

దీనికి సమీపమున బాపట్ల తా॥ నక్కలపాలెం కా॥ కమ్మవారు ఏలూరు వీరమ్మగారొక బావి త్రవ్వించిరి.

బెలంకొండ కోటినాగయ్యగారి బసవమందిరం వద్ద నొకరు బావి తీయించిరి. సూ॥ దిగువ శాసనం.

"యీకూపము క్షేమభూ॥ నా॥ గూ॥ శ్రీ రాజాపేట పురనివాశియగు గాతం నా॥ న్నా॥ కొ॥ వుడతా సుబ్బయ్య భార్య వీరనాగమ్మచే 1839వ శా॥శ॥ నా శ్రీమత్పింగళనామ స॥ మా॥ శుద్ధ 14 భానువాసరే శుభలగ్నంబున శ్రీమత్రికోటీశ్వరార్పణముగా త్రవ్వించిరి."

పాపవినాశనస్వామికొండక్రింద త్రోవలో బావి.

"మొనిగంట్ల బాపయ్యభార్య పిచ్చమ్మ ధర్మం నర్సారావుపేట ది 5-3-1932."

దీనికి సమీపమున మంగలి త్రవ్వించిన బావి.

"స్వస్తిశ్రీ అస్య సంవత్సరస్య కలియుగ శతాబ్దాః ౫౦౩౫ శాలివాహన శకగతాబ్దాః ౧౮౫౭ విక్రమార్క శకగతాబ్దాః ౧౯౯౧ హూణాశకః ౧౯౩౪-౩౫ భావసంవత్సర ఆశ్వీజ బ ౧౧ లు స్థిరవాసర ఉత్తరానక్షత్రయుక్త

మున నాపకవంశ పయఃపారావార రాకాసుధాకరుండును శ్రీ రంగరాజభట్ల గోత్రోద్భవుండును నారాయుని పౌత్రుండును చల్లాంబరామనల పుత్రుండును అనవరత శ్రీ రామచంద్ర పాదారవింద మకరందపానానందుండును నర్సరావుపేట నిలయుడునగు మురుగుల రామదాసు ధర్మపత్ని యుక్తుడై శ్రీయల్లమంద త్రికోటీశ్వరస్వామివారిసన్నిధిని మురుగుల పోలయ్య గుంటుపల్లి అంకమ ప్రోత్సాహములచే ప్రజల సౌకర్యార్థమై త్రవ్వింపబడిన యీకూప మాచంద్రతారార్కముగా విలసిల్లుగాత ది 11-11-1934."

"ఓంనమః— నర్సరావుపేట తాలూకా విప్పర్లపల్లి కాపురస్థుడు మురుగుల రామయ్య కుమారుడు రామదాసు 11—11—1934."

## పదియవ ప్రకరణము.

## అన్న సత్రములు.

ఈకొండపైన 80-90సం॥ల క్రిందట రావిప్రోలు కృష్ణయ్యగారు (వంగిపురం) శివరాత్రి తోలినాడాక సమారాధన చేయుచు 40 సం॥ లు సాగించిరి.

పిమ్మట ప్రతాపగిరి సుబ్బయ్యగారు (గురవయ్యపాలెం) ప్రారంభించి 30 సం॥ లు సాగించిరి. అటుపిమ్మట 1905 సం॥ మొదలు బ్ర॥ భాగి సుబ్రహ్మణ్యం యీ నారాయణబాబు యీ పరదేశి, యీ పున్నయ్య, చిన్నకుల సంగయ్యగార్లు (రాజాపేట) ధర్మకర్తలుగా నుండి పూర్వపు విధమున కొండపై సంతర్పణలు చేయుచుండిరి. మాఘ బ ౧౦ లు మొదలు శివరాత్రి మరునాటివరకు జరుపుదురు. రమారమి రు 500-0-0 శలవు చేయబడుచున్నదట. వీరందరు స్వర్గస్థులుకాగా వీరి వంశస్థులు కొందరు భక్తులు వీరివలెనే శ్రమపడి సాగింపుచున్నారు:

## గబ్బిటవారి సత్రము.

కొండక్రింద యాత్రికులకు భోజనవసతి లేకుండుటచే కీ॥ శే॥ బ్రహ్మశ్రీ గబ్బిట కోటయ్యగారు (బొప్పూడి) దిగువ నన్నసత్రము పెట్ట దలచి శాశ్వత చందాదారుల నేర్పరచి వారివలన ద్రవ్యము సంపాదించి (1891) ఖర సం॥ మొదలు

పెట్టనారంభించిరి. తొలుదొల్త రు 100—0—0 లతో నైదు నూర్ల బ్రాహ్మణులకొకదినము చేసిరి. రెండవయేట రెండు వేల మందికి భోజనమును శివరాత్రినాడు శనగగుగ్గిళ్లు ఫలహారమును పెట్టించిరి. మూడవయేట రెండుదినములు సంతర్పణయును శివరాత్రినాడు శనగల ఫలహారమును పెట్టించిరి. రాను రాను ఏకాదశి మొదలు శివరాత్రివరకు అన్నప్రదానమును శివరాత్రినాడు అరటిపండ్లు ఫలహారము మరునాడు సంతర్పణయును జరిగించుచున్నారు. మొదట తాటియాకు పందిళ్లక్రింద చేయుచు ప్లవ సంవత్సరమున (1901) నొక రాతిసత్రము కట్ట నారంభించి అందున జేయుచుండిరి. సత్రము (1909) కీలక సం॥ ముగిసినది. (1910) సం॥ ప్రాంతమునుండి శివరాత్రి ఫలహారమునకు శనగలకు బదులు అరటిపండ్లను పెట్టించుచు న్నారు. ప్రతి సం॥ చందాలు పోగుచేయుట కష్టమునియెంచి ఇరువదివేల రూపాయల విలువగల భూమిని సంపాదించి దానిపై వచ్చు ద్రవ్యముచే సత్రము సాగించవలెనని యత్నించిరి కాని పింగళ సం॥ చైత్ర శు ౧౮ లు (1917) ఏప్రియల్ 6 వ తేది) శుక్రవారమున వారు స్వర్గస్థులగుటచే నాప్రయత్నము విరమింపబడినది. వారి తదనంతరము వారి తమ్ములను బ్ర॥ గబ్బిట కృష్ణయ్యగారు (చీమలమఱ్ఱి) బ్ర॥ రెంటచింతల గురవయ్యగారును (సంతమాగులూరు) ధర్మకర్తలుగా నుండి యథాప్రకారము సత్రమును సాగింపుచున్నారు.

కృష్ణయ్యగారు ఈశ్వర సం॥ ఫాల్గుణ బ ౭ లు న స్వర్గస్థులుకాగా వారి స్థానే వారి కుమారుడు దైవసహాయము గారు ధర్మకర్తగా పనిచేయు చున్నారు.

సత్రము కట్టుబడి

ఇంకను బహుమంది పుణ్యులు ధర్మముచేసిరి. వారి పేర్లు సత్రము స్తంభములపై వ్రాయబడినవి. వానినిందు క్రింద వ్రాయుచున్నాను. ఈసత్రమునకుపూర్వము కీ। శే। శ్రీయుత తూబాటి శేషాద్రిగారు (నర్సరావుపేట తాలూకా తూబాడు) పీపాలతో పెరుగు పంపుచుండెడివారు. ఎచ్చట సంతర్పణలు జరిగినను వీరు పెరుగు పంపుచుండెడివారట. అందువలన పెరుగు శేషాద్రి అని పేర్కొనబడుచుండెడివారట.

గదులు కట్టించినవారు.

మ॥ రా॥ రా॥ శ్రీరాజా వాసిరెడ్డి జ్ఞానప్రసూన ప్రసూనాంబా బహద్దర్ జమీందారిణిగారు (అమరావతి) గదులు 2
,, కటికినేని వెంకటరమణయ్యరావుగారు (పెటూ్రువారిపాలెం) 1
,, గబ్బిట సుబ్బమ్మగారు (బొప్పూడి) 1
,, తాడేపల్లి ఆంజనేయశాస్త్రిగారు(నర్సరావుపేట) 1
,, జంపనిబుచ్చయ్యగారు(చాగల్లుశివారుకండ్లగుంట) 1
,, యీ వెంకయ్యగారు 1
,, గుంటుపల్లి వెంకయ్యగారు 1
,, చెరుకూరి చంద్రయ్యగారు 1
,, యీ చౌదరమ్మగారు 1
,, బత్తినేని అనంతయ్యగారు (పురుషోత్తమపట్నం) 1
,, భండారం వెంకమ్మగారు (చిలకలూరుపేట) 1

## శిలాస్తంభములిచ్చిన వారు.

,, గొట్టిపాటి చెంచుసుబ్బారాయుడుగారు
,, రంగావఝ్ఝల గురవయ్యగారి కు॥ హనుమయ్యగారు
,, కొండభొట్ల గోపాలకృష్ణయ్యగారు
,, చిలకలపూడి రామస్వామిగారు
,, పాటిబండ్ల వేంకటప్పయ్యగారు
,, యీం అమరయ్యగారు
,, పరిమి శివరామయ్యగారు
,, తిప్పావఝ్ఝల తాతయ్యగారు
,, విష్ణుభొట్ల నారాయణంగారు
,, దేవరకొండ జగన్నాధరావుగారు
,, మద్దూరు లక్ష్మీనరసింహంగారు
,, రావిపాటి శ్రీరాములుగారు
,, కర్లపాలెం రామకృష్ణయ్యగారు
,, పోచంచర్ల రామకృష్ణయ్యగారు
,, మన్నేపల్లి సుందరరామయ్యగారు
,, కొత్త రంగయ్యగారు సా॥ నర్సారావుపేట

సింహద్వారము కప్పు బండపైన బలిసెట్ల గోత్రోద్భవుండు మండవ లక్ష్మీపతి ధర్మం (నర్సారావుపేట) అని కలదు.

ఇట్లే ప్రతికప్పు రాతిపైనను అనేక పేర్లుగలవు. వానినెల్ల నుదహరించుట దుస్తరము.

## భూములిచ్చినవారు.

| భూమియిచ్చినగ్రామం | | య. శె. | |
|---|---|---|---|
| గోనెపూడి | శ్రీపాపరాజు కోటయ్యగారు | 1—25 | ఈనాం మెరక |
| పెదచెరుకూరు | కక్కెర సుబ్బారాయుడుగారిభార్య లక్ష్మీదేవమ్మగారు | 1—08 | శేరీపల్లం |
| ముత్తనపల్లి | శాఖమూరి వేంకటకృష్ణానాయుడుగారు | 4—0 | అగ్రహారంమెరక |
| రావిపాడు | గబ్బిట కోటయ్యగారు (సొంతం) | 8—0 | ఈనాం మెరక |
| అబ్బినగుంటపాలెం | డిటో | 2—0 | డిటో |
| చిలకలూరిపేట | మైలవరపు వెంకటప్పయ్యగారు | 1—0 | శేరీమెరక |
| కోమిరెపూడి | పున్నావఝ్ఝుల వీరభద్రయ్యగారిభార్య పేరమ్మగారు | 2—0 | ఈనాం మెరక |
| కోలలపూడి | కందిమళ్ల రామస్వామిగారికు॥ శేషయ్య యీయన కు॥ వీరయ్యగార్లు | 1—0 | శేరీమెరక |

## గబ్బిట కోటయ్యగారి యితర ధర్మములు.

1. ఇదిగాక యీ కోటయ్యగారు కొండ మధ్యసోపానమార్గమున నడుమనడుమ విశ్రమశాలలు కట్టించి మార్గము ప్రక్కన చెట్లు వేయించిరి.

2. కేతమక్కలవారి అగ్రహారమున శివాలయమును ఆంజనేయాలయమును కట్టించి ప్రతిష్ఠించిరి. ఆయగ్రహారీకులు మెరక య 18-0 పల్లం య 1-0 శివునకును కోటయ్యగారు సొంతమున ఆంజనేయస్వామి కచటనే య 11-0 మెరక విప్పర్లలో య 1-0 పల్లమును సమర్పించిరి.

3. కేసానుపల్లె బయిస్కాపురము మధ్య రోడ్డుప్రక్కన కనుపర్తిభూమిలో బావి విశ్రమశాల చెట్లు వేయించిరి.

4. కృష్ణాతీరము (ఉత్తరవాహిని) సత్తెనపల్లి తా॥ మాదిపాటికి దక్షిణం ౨ మైళ్లలో భారద్వాజాశ్రమమున ఉత్తరేశ్వరస్వామికి ప్రతి సోమవారమున నివేదన యేర్పాటుచేసిరి.

5. చేజర్లలో నీశ్వరాలయమున తుంగదుర్తి బుచ్చయ్యగారి సమాధికి నివేదనకై కొంత వసతి నేర్పరచిరి.

## గుడిపల్లివారి సత్రము.

కీ॥ శే॥ గుడిపల్లి అయ్యంభొట్లుగారు కొండక్రింద దేవాలయములతో పాటు అన్నసత్రమును కట్టించి కొంతకాలము

నిత్యాన్నదానము సాగించిరి. అదివరకేను సం॥లనుండి కొండ వద్ద శివరాత్రినాడు అన్నప్రదానము సేయుచుండిరి. వీరు శుక్ల సం॥ కార్తీక శు ౧౫ లు (1929 సం॥ నవంబర్ 16 తేది) శని వారమున స్వర్గస్థులుకాగా తదాది వీరితమ్ముడు బ్ర॥ అమరయ్య గారు శివరాత్రి సమారాధన సాగింపుచున్నారు. వీరి తండ్రి గారి నాటనుండి గోవిందపురమున యింటనే శివరాత్రి యాత్రి కులకు సమారాధనలు చేయుచుండిరి. కొండవద్ద చేయుట వలన నిది విరమింపఁబడినది.

శరన్నవరాత్రములందు అమ్మవారి పూజాదినములలో అన్నప్రదానమునకు వర్షము మొదలగు కొన్ని యిబ్బందులుకలు గుటచే కోవెల సమీపమున సత్రము గదులు కొందఱు భక్తు లుకట్టించిరి. వారిపేర్లు గదులపై వ్రాసిన వాని నిందు వ్రా యుచున్నాను.

(1) "అప్పన వెంకటకృష్ణయ్యగారి భార్య రామమ్మ ధర్మం బెజవాడ 1934"

(2) పేరు వ్రాయలేదు.

(3) "చింతలచెర్వు వెంకటనరసయ్యగారి కుమారుఁడు కోటీశ్వరరావు ధర్మం నర్సారావుపేట 1934"

(4) "దాతృదాతల సహాయముచే కట్టించిన మేనేజర్లు 1. చింతలచెర్వు కోటీశ్వరరావు 2. నాగసరపు పాపయ్య. 3. మండవ రామకృష్ణయ్య నర్సారావు పేట 1934."

(5) "అప్పన వెంకటకృష్ణయ్యగారి భార్య రామమ్మ ధర్మం బెజవాడ 1934."

(6) పేరులేదు. (కనికణుపుల గురవయ్యసెట్టి భార్య లక్ష్మీనరసమ్మధర్మం గుంటూరు అని వ్రాసి కొట్టివేసియున్నది.)

(7) "కిలారు చినవెంకయ్య కుమారుడు నరసయ్యగారి భార్య నారమ్మ కమ్మవారిపాలెం 1934 సం॥"

(8) "శ్రీగిరిరాజు తిరుమలయ్యగారి భార్య వెంకటశ్యామల లక్ష్మీనరసమ్మగారి ధర్మం యడవల్లి 1937."

(9) "పొత్తూరి వెంకటనారాయణ వియ్యమ్మగారి కు॥ సుబ్బారావు ధర్మం 1936"

(10) శ్రీగిరిరాజు వెంకయ్య రుక్మిణమ్మగార్ల పేర కుమాళ్ళు తిరుమలయ్య రామమూర్తి కృష్ణమూర్తిగార్ల ధర్మం 1936."

నె 8-9 ర్ల గదులవెనక గోడమీదగలది.

"1935.

శ్రీ సీతారామలక్ష్మణ భరతసమేత ఆంజనేయవిలాసం. శ్రీగిరిరాజు వెంకయ్య కుమారుడు తిరుమలయ్య యడవల్లి."

నె 10 రు గది వెనక గోడమీదగలది.

"కాశీవిశ్వేశ్వర అన్నపూర్ణ శ్రీగిరిరాజు వెంకయ్యగారి కుమారుడు రామమూర్తి యడవల్లి 1935 సం॥"

నెం 7 వ గది వెనక గోడమీదిది

"కీలారు చిన్నవెంకయ్య కుమారుడు నరసయ్యగారి భార్య నారమ్మ కమ్మవారిపాలె. 1934 సం॥"

## విశ్వబ్రాహ్మణ సత్రము.

కొండక్రింద విశ్వబ్రాహ్మణ సత్రముకలదు. దానియందుగల శాసనము నిందు వ్రాసెదను.

"విశ్వబ్రాహ్మణ సత్రమును మల్లవరపు భద్రయ్య అనువారు బ్రహ్మంగారి మందిరము ప్రారంభించి గతించినారు. తదుపరి ముక్తేశ్వరము గ్రామవాస్తవ్యులు కుందిరె శరభమ్మ అనువారు మందిరములోవుండి వృద్ధిచేయుచున్నది. ఆమందిరమున విశ్వబ్రాహ్మణుల సహాయమున 1922 సంవత్సరములో బావిని త్రవ్వించినారు."

షరా:— ఈశాసనమిటీవల గాలివానకు యెచటనో పడిపోయి కనుపించుటలేదు.

## పద్మశాలీల సత్రము.

శివరాత్ర్యుత్సవ దినములందు రాజాపేట పద్మశాలీలు వారి కులస్థుల ద్రవ్యసహాయముచే నొక అన్నసత్రము పెట్టుచున్నారు. ఇందుకు యోడ్రోమెంటువారు వసతికి సహాయము చేయుచున్నారు. పూర్వము 50 సం॥ల నుండి పోతవరము

పద్మశాలీలు దాసరి స్వామి మున్నగువారు శివరాత్రినాడు చలివేంద్రియను అన్నసత్రమును కొద్దిమంది జంగాలకు మాత్రమే పెట్టుచుండిరి. (వీరు ప్రస్తుతం సత్తెనపల్లి తా॥ భీమవరముననుండిరి) ఈ సత్రమునే 1930 సం॥ మొదలు రాజపేటవారు వృద్ధిచేసి విరివిగ జరిగింపుచున్నారు. శాశ్వతసత్రశాలా నిర్మాణమునకు భక్తులు యత్నింపుచున్నారు. శ్రీత్రికోటీశ్వరుని కరుణచే శీఘ్రకాలమున నెరవేరుగాక:—

## ఆర్యవైశ్య సత్రము.

నరసరావుపేట ఆర్యవైశ్య సంఘమువారు కోటప్పకొండవద్ద ప్రభవ సం॥ మార్గశిర శు ౭ లు గురువారము ధనిష్టానక్షత్రయుక్త మకరలగ్నము (1927 డిశెంబర్ 1వ తేది) ఉదయం గం॥ 10-33 లకు శంకుస్థాపన చేయించి శాశ్వతమగు అన్నసత్రమును కట్టించి విభవ సం॥ మాఘ బ ౧౧ లున ప్రవేశించిరి. ఇచట శివరాత్రికి గొప్ప వైశ్య సంతర్పణలు జరుపుదురు.

బ్ర॥ మ॥ మంచికంటి వేంకటరామయ్యగారు (కంట్రాక్టర్ నరసరావుపేట) చెఱువు లోదట్టున బసవమందిరముల యొద్ద నొక సత్రమును కట్టింపుచున్నారు.

తాత్కాలికముగా ననేకులు భక్తులు ఉత్సవదినములలో కొండవద్దను యిండ్లవద్దను యథాశక్తిని అన్నసత్రములు చలివేంద్రములు పెట్టుచున్నారు. వానినిందుఁ వ్రాయుట యనావశ్యకము.

పూర్వము రామనగు సుబ్బయ్యగారు నాదెండ్లలోను రామచంద్రుల చెన్నయ్యగారు చిలకలూరిపేటలోను గుడిపల్లి అయ్యంభొట్లుగారు గోవిందపురములోను యాత్రికులకు అన్న ప్రదానము చేయుచుండిరి. రాళ్లబండి సూరయ్యగారు (కూరాడు) గంగనపాలెమున 30 సం॥లు సంతర్పణలు చేసి యుటీవల గతించిరి.

## చలివేంద్రలు.

ఇచటికివచ్చు యాత్రికులకై చుట్టుపట్లగ్రామములవారు మార్గమధ్యమునను కొండపైనను క్రిందను చలివేంద్రలు పెట్టు చున్నారు. వానినెల్ల నిందు వ్రాయుట దుస్తరము కాని ముఖ్యమగు వాని నిందు వ్రాయుచున్నాను.

1 కొమిరిశెట్టి లక్ష్మయ్యగారు వగైరా (గంగనపాలెం) చల్ల చలివేంద్రపెట్టుచున్నారు:

2 గొల్లభామ శివుని సేవించి ముక్తినొందెనను అభిమానముచే జొన్నలగడ్డ గురవయ్యపాలెం కేసానుపల్లి మొదలగు గ్రామములగొల్లలు భక్తితో కొండయొద్ద బహుకాలము నుండి చల్ల చలివేంద్రలు పెట్టుచున్నారు.

3 జంగం నాగమ్మ (మురికెపూడి) కొండపైన వేరొక చల్ల చలివేంద్ర పెట్టుచుండెను.

## పదునొకండవ ప్రకరణము.

### పరిపాలనము.

పూర్వమీ స్థలము బెల్లంకొండసీమలోచేరి అ
దార్ల పాలనక్రింద నుండినట్లు యంత్రోద్ధారణ శాసన
తెలియుచున్నది. పిదప నర్సారావుపేట జమీందా
నకువచ్చి యిప్పటివరకు వారి పాలనక్రిందనే యున్నది

ఇటీవల యెండోమెంటు బోర్డువారు జరిగించి
హారముపైని 1935 సం॥ నుంచి వారి పాలనక్రిందకి
దేవస్థానపాలనకై బోర్డువారు మేనేజరు మొదలగువార
ర్పరచి కొండపై కచ్చేరి కట్టించిరి.

వీరు ప్రజల సౌఖ్యమునకై నీటివసతులు నివా
గ్యములగు పందిళ్లు నిత్యవాసమునకుదగు కట్టడముల
భయము లేకుండునట్లు కావలివాండ్రు మొదలగు సౌ
లొనరింపుచున్నారు.

తాలూకాబోర్డువారి యెండోమెంటు బో
ధర్మములు సౌకర్యములు.

పూర్వమునుండియు శివరాత్రి ఉత్సవదినముల
లూకాబోర్డువారు కొండక్రింద బజార్లు తీర్పించి పాకా
దిప్పు వేయించి నీటివసతులు (బావులు మరమ్మతులు)

ఓపక్కా వసతులు ఎలక్ట్రిక్ దీపాలు గ్యాసులైట్లు మొదలగు సౌకర్యములు జరిగింపుచున్నారు.

తాలూకాబోర్డుప్రెసిడెంటు గారగు మ॥ రా॥ రా॥ శ్రీ చింతలచెఱువు కోటీశ్వరరావు పంతులుగారి (బి. ఏ. ప్లీడరు నర్సరావుపేట) యాజమాన్యమున నర్సరావుపేటనుండి కోటప్ప కొండకు 1927 సం॥ ప్రారంభించబడి జనరల్ రోడ్డు వేయించబడినది.

## వచ్చుబడులు.

శ్రీ స్వామివారికి భక్తులు సమర్పించు మ్రొక్కుబడులు కానుకలు మొదలగు వానికి గుడియందు ఉండీలు (డిబ్బెలు) పెట్టుదురు. ఇవిగాక యీదిగువ స్థలములందు వచ్చుబడుల నిజారాల కిచ్చెదరు.

1 బొచ్చుకోటప్ప గుడి
 (ఎ) బొచ్చు కత్తిరింపులకు
 (బి) బొచ్చు తీసుకొనుటకు
 (సి) కానుకలకు
2 అడవి రామలింగస్వామి గుడి
3 పాపవినాశనస్వామి గుడి
4 స్థంబాలు.
5 లింగములు:— ఈ స్థలమున వచ్చుబడిలో 5/9

కోటయ్యగారికిని జెందుచున్నవి. ఈపద్ధతి అనాదినుండి
చున్నదని తెలియుచున్నది.

## నిత్యసేవలు, ఉత్సవములు.

కొండపైన సాధారణముగా శ్రీ కోటీశ్వరస్వామి
సన్నిధిని అర్చకులతోపాటు భక్తులుకూడా నివసించి ప్ర
ణాది సేవలుచేసి కృతార్థులగుచున్నారు. నిరంతరము అ
దీపము అభిషేకపూజాదులు జరుగుచున్నవి. నర్సారావ
తాలూకా కాకాని కాపురస్థుడు బ్రహ్మశ్రీ అంబటిపూడి
మూర్తిగారి కుమారుడు సూర్యనారాయణగారు సంతా
మై ౯గి సంవత్సరములక్రిందట నిచట ఆహారనియమముతో
డు నెలలు రాజరాజేశ్వరీ మంత్ర పురశ్చరణచేసి సంతా
ప్తులయినారని తెలియుచున్నది.

ఇదిగాక యిప్పటికిని భూతపీడితులును కండ్లు మొ
అవయవవైకల్యులు నిచట ప్రదక్షిణాదులొనర్చి కృతార్థ
చున్నారు.

ప్రతి మాఘ శు ౧ లు మొదలు మాసాంతమువర
ప్రజలు పశువులతో గిరిప్రదక్షిణములుచేసి స్వామిని
మ్రొక్కుబడులు తీర్చుకొనుచుందురు.

తడిగుడ్డలతో చిన్నచిన్న ప్రభలను బండ్లపైనుంచి
ములపైఁబెట్టుకుని యుత్సవము చేసికొనుచు కొండ పై



శ్రీ త్రికోటేశ్వరాలయ మహోత్సవ దృశ్యము.

కోవెల ప్రదక్షణములుచేసి అభిషేకములు చేయించి కానుక లర్పించి శక్తికొలది అన్నదానము చేయుదురు.

అనేకులు భిక్షుకులు అంగవైకల్యులు మొదలగువారు సోపానమార్గములందుందురు. వారికి ధర్మములు చేయుదురు.

శివరాత్రి రెండుమూడు రోజులు కద్దనగా సందడికోర్వ లేనివారువచ్చి సేవించుచుందురు. శివరాత్రికి గ్రామప్రభలను (15 గ॥ మొదలు 30 గజములవరకు యెత్తుగలవి) కట్టించి మహోత్సవముతో వేనవేలు జనులు వచ్చి సేవింతురు.

శివుని కొండను నెత్తిన మోసికొని వచ్చునట్లు మ్రొక్కుబడులు కలవారును తదితరులును ఆసూచనతో కొండ మొకిర దాపునకు రాగానె యొకచిన్న రాతిని నెత్తిన బెట్టుకొని "హర హరా"యని స్మరణచేసి కొండప్రకటన వేసి తిరువాళ్ల ప్రదేశమునకు చేరుదురు. ఈ రాళ్లోక చిన్న తిప్పయైనది. ఇది పురాతనాచారము.

ఈ యుత్సవమునకు చాలా దూరస్థలములనుండి బహు జనులు వత్తురు జనులు ప్రభలబండ్లు మొదలగు వానితో రమారమి 2 మైళ్ల స్థలమాక్రమింపబడును. రమారమి రెండు లక్షలమంది వచ్చెదరని అంచనా వేయవచ్చును. శివరాత్రి తెల్లవారుఝామున మొదలు జనులు తిర్గి వెళ్ళుచుందురు. కల్పసామానులు మిఠాయి పండ్ల దుకాణములు కాఫీక్లబ్బులు వివిధమగు పెట్టెలు (కొయ్యాకేకులు) మొదలగు సమస్తవస్తు సంభారముల దుకాణములు యితర దృశ్యములు వచ్చును.

త్రి సమయమునకు నిర్నిమిత్తముగా నొక వాంఛోద్రేక
ంగి తక్షణంబ బయలు వెడలుదురు. ఇట్టి యుద్రేకము
ముఖ్యకారణము యంత్రబలమే యని చెప్పుదురు.

ఈ యుత్సవము రైల్ వచ్చినపిదప యాత్రికులకు మిగుల
ర్యమేర్పడి నానాట వృద్ధియగుచున్నది. ఇది యంతయు శ్రీ
త్రికోటీశ్వరుని సంపూర్ణానుగ్రహమే కాన భక్తులెల్లరును
త్రికోటీశ్వరానుగ్రహమునకుఁ బాత్రులై భక్తిప్రపత్తులతో
చి యిహపర సౌఖ్యములొందుదురు గాక యని విన్నవించి
చరిత్ర మింతట శ్రీమత్త్రికోటీశ్వరార్పణముగ సమాప్తి
ంచుచున్నాను.

గద్య.

క॥ పుడమిని గౌండిన్యస గో।
త్రుఁడు మద్దులపల్లి శ్రీ గురు బ్రహ్మాభి।
ఖ్యుడు కోటీశ్వర చరితముఁ।
గడువెలయ రచించె శీతకరధరుకరుణన్ ॥

అచట నుత్సవదినములలో మద్యమాంసా
యోగింపరు. వ్యభిచారం వర్జింతురు.

పూర్వము శివరాత్రికి సారాదుకాణముల
లై సెన్సుమీద కొండయొద్ద పెట్టుచుండిరి. 1909
ఫిబ్రవరి 18 వ తేది పగలు పన్నెండు ఘంటలప్పు
(కలహము) జరిగిన నాటినుండి ప్రభుత్వమువారి
కల్లుమకాణములు పెట్టకుండుటయేగాక కొండకు
మైళ్లలోపు గ్రామములందుకూడ నుత్సవదినములలో
ములు మూయునట్లును ఇచట న్యూసెన్సుఆక్టు రద్దు
రాచేశినవారిపై కేసులుపెట్టి శిక్షింపకుండునట్లును
రీత్యా (డ్యూటిమీద) ఇచటికి వెళ్లవలసినఉద్యోగుల
సహితముగా వెళ్లకుండునట్లును మొదలగు కట్టుబా
జలకు సౌకర్యము కలిగించిరి.

సమాప్తి.

ఆంధ్ర దేశమునగల ప్రజలమితభక్తితో
యంబుబందు శ్రీకోటీశ్వరస్వామికి ప్రార్థనలు (మొ
మొక్కి ఆపదలు నివారించుతాడనే శివరాత్రి ది
మొక్కుబడులు తీర్చుకొని స్వామిని సేవించుచుం

ఇట్టివారేకాక యితరులును మిగుల నుత్సా
శివరాత్య్రుత్సవమునకు వచ్చెదరు. సంకల్పము